# పీ ఠి క. (ప్రథమముద్రణము)

విద్వత్కవిరత్న దైవజ్ఞమణీత్యాది బిరుదాంకితులును బహుభాషాభిజ్ఞులునగు శ్రీ ముత్య సుబ్బారాయుడుగారి నూతన సృష్టియగు "నిశ్శ్రేయసానందము" నాంధ్రాళికి బరిచయముచేయు భాగ్యము గల్గినందులకు సంతసిల్లుచున్నాడను. రసరీతి వృత్త్యలంకారాదులచేతను, భాషాపాటవముచేతను పాత్రపోషణాచాతురిచేతను, సకలజనచేతోమోదకరము, సున్నతాదర్శప్రదర్శకమును నైన యీకావ్యము కవిగారి యితర కావ్యములముల సంప్రదాయమునే యనుసరించి, వివేకబోధకమై యలరారుచున్నది. ఈ గ్రంథమున నిస్సారమైన పద్దెము మందునకైనను గానరాదు. ఏదోయొక చమత్కారమో యుత్కృష్టనీతి బోధయో మానవప్రకృతి పరిశీలనమో, బాహ్యప్రకృతి వర్ణనమో, లోకోక్తియో రచనాప్రాగల్భ్యమోలేని పద్యమిందుగన్పట్టదు. లోకోక్తులు, నీతులు, భావానుకూలభాషాగతులు, శబ్దాలంకారములు, అర్థాలంకారములు శ్లేషలుప్రౌఢకల్పనలు, ప్రాసపాటవము ప్రత్యక్ష రచలజిహ్వానిరోష్ఠ్యమువంటి చిత్రకవిత్వములు పెక్కులిందు గన్పట్టగలవు. భాషలలితము. ధారఝురీసదృశము నిర్దుష్టమును.

ఈకవితల్లజుని కవితాప్రావీణ్యమునకు జోడైనది కథాసంవిధానకౌశలము. దీనిని చదువబ్రారంభించిన తొలువేల్ల గ్రీకురాణియగు క్రిసెల్డా, నామదికి గోచరమై పిదప మాయమైనది. ఆమెకథవలె దుఃఖాంతముగాగాక మిక్కిలి యద్భుతమగు సుఖాంతముగానిది చిత్రింపబడినది. ప్రతిపాత్రమును. తీర్చిదిద్దినయట్లుండి వివేకమును వెదజల్లుచున్నది.

సతీపతిధర్మములు, రాజధర్మములు, సచివధర్మములు, మానవధర్మములు, కర్మవైచిత్ర్యము ధర్మవిజయము మున్నగునవిందు చక్కగా వెలయింపబడినవి. ఈ గ్రంథము విద్యార్థులకు భావభాషాభివర్ధకమగుటచే పాఠ్యగ్రంథముగ సర్వవిధముల తగియున్నది. వీరి "భక్తితత్త్వసుధాలహరి" "హితైషిణి" "విదుషి" "సంవర్ధనము" మొదలగు ఇతర గ్రంథములవలెనే ఇద్ది విద్యార్థులకేకాక విజ్ఞానపిపాసువులకును విందొనర్చుననుట సుంతయు నతిశయోక్తికానేరదు. చదువు కొలదియు పాఠకులే యిందలి గుణములు గ్రహింపనేర్తురుగాన విస్తరభీతిచే నిందువ్రాయవిరమించుచున్నాడను.

జటావల్లభుల పురుషోత్తం. M. A.

ఓం.

# యోగ్యతాపత్రమ్.

పశ్చిమగోదావరీ మండలాంతర్గత క్షీరారామపురీ వాస్తవ్యస్య శ్రీముత్య వంశదీపకస్య సుబ్బారాయశర్మణో జ్యోతిషకవిత్వ వేదాంత శాస్త్రేషు ప్రజ్ఞావిశేషం పండితసమక్షం ప్రత్యక్షీకృత్య ముదా నారాయణస్మరణపూర్వకే ఆశీర్వాదపురస్సరేచ దత్తే ఇమే బిరుదే.

(1) దైవజ్ఞమణి (2) విద్వత్కవిరత్న ఇతిచ ఇతి నారాయణస్మరణమ్

శ్రీ త్రివిక్రమ రామానందభారతీస్వామి

శ్రీ సిద్ధేశ్వర పీఠాధిపతి, కుర్తాళము. తిరునల్వేలి జిల్లా

## అభిప్రాయములు.

మ. అతిరమ్యమ్ము, లసత్కవిత్వమహిత, మ్మత్యద్భుతాపాదిచా
ర్వితివృత్తమ్ము ప్రశస్త నీతికల నోద్వృత్తమ్ముఁ బంచత్కళా
న్వితమానందరసైక వాసమగు నీ నిశ్శ్రేయసానంద సత్
కృతి రత్నమ్ము ప్రశస్తిఁ జెందు జగతిన్ శ్రీసుబ్బరాయాహ్వయా!

గీ. మేథ విస్మయ సంపాది, మేలుశయ్య
గాథ నూడంగ స్వకపోలకల్పితంబు
శుద్ధి గలయదిధార, నీబుద్ధియింక
సుజనులకు నెల్ల స్తుత్యంబు, సుబ్బరాయ!

శ్రీ కవిరత్న కాకర్ల కొండలరాయ శతావధాని.

ఉ. శ్రీయుతముత్య వంశ్యుఁడు రచించిన యీరమణీయమైన ని
శ్శ్రేయస కావ్యమున్ జదువఁజేకుఱు మోదము, తీతియబ్బు, ధా
రాయుతమై కవిత్వము విరాజిలుచుండుటఁ బాఠకాళికెం
దేమెడ నాదరం బొదవు నెల్లరుమెచ్చగ! సుబ్బరాయనిన్!

శ్రీ నాదెళ్ళమేధా దక్షిణామూర్తిశాస్త్రి బందరు.

## విజ్ఞప్తి (ప్రథమ ముద్రణము)

కం. పదితొమ్మిది వందలము
ప్పదియారవ వర్షమదె ప్రభవంబగు ని
య్యది వచ్చెనేటి కచ్చున
కు, దయన్ నెచ్చెలులు హెచ్చుకూరిమిఁ దేరన్.

మ. స్వకృషిన్ వేగ ముగించి నౕ గని తమిన్ బద్యావళిన్ వ్రాయఁజే
యకనిద్రింపని గబ్బుఁడౌ గిడుగువంశాంబోధి చంద్రుండు జా
నకి రామాఖ్యునికిన్ గృతజ్ఞుఁడను తన్మాన్యాత్మసాయానఁగా
కిఁకనేనీపదునేడు వర్షములలో నేకావ్యమున్ వ్రాయమిౕ.

## పీఠిక. (ద్వితీయముద్రణము)

మిత్రులును చదువరులును నీచిన్ని పొత్తమునందు చూపిన యాదరాభిమానములకెంతయు సంతసము. 1957 మార్చి 1958 మార్చి నెలలలో జరుపు భాషాప్రవీణ పరీక్షకు దీనినొక పాఠ్యగ్రంథముగా నెన్నిన ఆంధ్రయూనివర్శిటీ పెద్దలకును కృతజ్ఞుడను. ప్రోత్సహించి యీగ్రంథమును మొదటఅచ్చునకు తెచ్చిన శ్రీ మంతెన సత్యనారాయణరాజుగారు నేడు అపారమగు సతీ వియోగభార వారధి నిమగ్నులయ్యు విద్యాభిమానము పెంపున నైజ విశాల భావప్రదర్శకముగా నయాచితముగా నీపునర్ముద్రణమునకుకూడ మూల్య మొసగి సాయపడినందుకు వీరికి కృతజ్ఞుడను. దీర్ఘాయుస్సుఖ కీర్తి సంపదలతో వీరును వీరివంశీయులును విమలముగా వర్ధిల్లజేయుటకు విశ్వేశ్వరుని విశేషముగ వేడుకొందును. విజ్ఞులీగ్రంథసారమునే కూరిమి గ్రహించి నేరముల నపారదయ జారవిడువగోరిక. సకాలమున ముద్రించి యందించిన భాను ముద్రణాలయాధిపతులగు శ్రీ కామిశెట్టి రామచంద్రరావు గారును ప్రశంసార్హులు.

గీ. ఎంతజాగరూకతతోఁడ నేర్పఱిచిన
నచుతప్పులు దొర్లంగ నయ్యెనిందుఁ
దుదినిజేర్చంగఁబడియె వానిదయఁగాంచి
కలుగు శ్రమకు క్షమింకురుగాత బుధులు!

## మిత్రప్రశంస.

శా. శ్రీరమ్యమ్ము బుధాళిగమ్యము గుణశ్రీసౌమ్యమున్ బండితా
శీరాజన్నిలయమ్ము నా చెలుకుమల్లి గ్రామమం దెన్నికన్
మీరంగల్గిన క్షత్రియాన్వయమునన్ జెన్నొందు శ్రీమంతెన
స్ఫారోద్వంశమునన్ యశంబుగనెఁ బ్రిజ్ఞన్ బద్మరాజెంతయున్.

మ. అతివిఖ్యాతి వహించిమించిన ఘనుండౌ పద్మరాజాఖ్యుఁడా
ధృతిసీతా సతియందుఁగాంచె సుతులన్ ద్రేతాగ్నులో యంచుఁగీ
ర్తితమూర్తిత్రయమో యటంచుజనులుర్విన్ స్తోత్రముల్ సేయఁగా
నతుల ప్రాభవులైన ముప్పురను విఖ్యాత ప్రభావాఢ్యులన్.

సీ. వీరిలో జ్యేష్ఠుండు వేంకటపతిరాజు
వితరణ ఖనియంచుఁ బేరుఁగాంచె
ధీరుఁడందు ద్వితీయుఁడౌ రంగరాజాఖ్యుఁ
డతిదైవపరుఁడుగా యశముఁ గాంచె
నమలుఁడందుఁదృతీయుఁడగు దుర్గరాజాఖ్యుఁ
డుదకరంబులిడి కృషులొనరఁబెంచె
స్థానిక సంస్థలీతని వరియింపఁ బ్రి
సిద్ధకార్యము లెన్నొ చేసి మించె
నందురంగరాజాఖ్య సౌమ్యగుణపేటి
కమల లక్ష్మీనరసమాంబ యందుఁ బొడమె
ప్రథిత రఘురామచింతాపరాయణుండు
ప్రణుత సుగుణుండు సత్యనారాయణుండు.

సీ. భూపతిరాజు లక్ష్మీపతిరాజాఖ్య
దాతయే వాని మాతామహుండు
వేంకట నరసాఖ్య విశ్రుతవిమలగు
ణాఢ్యయే వాని యమ్మమ్మగారు

వేంకటకృష్ణరాజాంకిత యాచక
త్రాతయెవ్వాని జ్యేష్ఠమాతులుండు
ప్రధిప వేంకటనృసింహరాజాఖ్య సద్గుణ
మణియెవ్వాని ద్వితీయ మాతులుండు
నట్టి సద్గుణవ్రాతు దయాసమేతు
భవ్యగుణపూతు క్షత్రియవంశజాతు
నార్తసుర భూజు నుతియింతు నమలతేజు
నలఘు తరసత్యనారాయణాఖ్యరాజు.

శా. లేఖోల్లక్షణమండితంబయిన బల్ పెన్మెత్స వంశంబునన్
ముఖ్యున్ బండితకీర్తితాఖ్యు రసదీప్తున్ సూర్యనారాయణ
ప్రఖ్యాతోన్నత రాజపుంగవుని విద్వత్శోభితున్ మామగా
విఖ్యాతింగాంచె నీమహామహుఁడుసంప్రీతాత్ముఁడై యెంతయున్.

ఉ. మాయురె! యేమి తెల్పనగు! మంతెన వంశపయోధిచంద్రుఁడై
శ్రీయుతుఁడున్ సుధీయుతుఁడు శిష్టజనస్తుత సద్గుణాఢ్యుఁడున్
న్యాయపథానువర్తియు ననంతయశోన్వితుఁడైన సత్యనా
రాయణరాజధీరుని, మహత్తర సచ్చరితాప్రశస్తినిన్.

మ. జనవిత్తప్రబలాఢ్యుఁడయ్యుఁ గనఁడీషణ్మాత్రదర్పంబు, సా
గిననున్ జేరఁడధర్మమార్గముఁ బరక్షేమంబె కాంక్షించు, ని
త్యనిరాడంబరజీవియై మను ననంతాత్యున్నతిన్ గ్రాలి, కా
వునఁ బంచాయతిబోర్డు పొందువిడకెప్డున్ వీరిఁదన్నాధుగన్.

కం. సిరియును వాణియు నొక్కట
వరలరు భువినన్నవార్త వమ్ముగ మిగులన్
సిరినొంది కావ్యవిదుఁడై
కరమరుదుగ దనరునీ యఖండ గుణుఁడిటన్.

శా. ఆసామాన్యాత్ముని లేమ యప్రతిమురాలౌ నా యశంబొందుల
క్ష్మీసీతాఖ్యను దైవభక్తిఁ బతిభక్తిన్ దీనదాస్యాదిర

క్షాసక్తిన్ వరదానశక్తి ఘనవిద్యారక్తియుక్తిన్ మహో
ల్లాసం బేసమయంబునం దెసగి కల్లల్ లేని సచ్ఛీలలై.

ఉ. ఆయిలు సొచ్చివచ్చుప్రతియాచకుఁ డర్థియు బందుగుల్ సఖుల్
శ్రీయుతులైన నిర్ధనులు శిష్టులపండితులైనఁ గూడ మా
హాయని హాయినొందుచు దదర్పిత సత్కృతిగౌరవాదరా
మేయవిధానముల్ గుఱిచి మేలుగఁబల్కుదు రెల్లకాలమున్.

గీ. ఆసతీపతులిరువురు నఖిలసద్గు
ణాళి నొకరొకరిని మింతురందుమరియు
కేవలము రామ గుణసీమ గీముగోము
ప్రేమ నోము నేమర కేమి క్షేమమలర.

కం. మచ్చునకుఁ బొందునన నే
పొచ్చెములేనట్టి సుగుణమూర్తుల గనెనా
యచ్చపుయుగ్మను ముచ్చట
హెచ్చగ పుత్రునొక పుత్రినెల్లరు బొగడన్.

చం. తనయుఁడు రంగరాజు విబుధస్తుత సద్గుణుఁడౌచు నాంగ్లవి
ద్యనుఁ గొనుచుండెఁబట్టము, సుతామణి సీతయు సీతయైస్వవ
ర్తనుభయవంశకీర్తులఁ గరమ్ముఁదిరమ్మధికమ్ము జేయు వీ
రిని సుఖసంపదాయువులఁ బ్రేమనుఁ బ్రోతురుగాత దేవతల్!

ఉ. ఆయలఘుప్రవర్తనుఁ డుదంచితకీర్తియుతుండు సత్యనా
రాయణరాజ నామవిమలాత్ముఁడు నే రచియించినట్టి ని
శ్శ్రేయస సచ్చరిత్రమును ప్రేముడి నచ్చనఁ దెచ్చు మూల్యమ
త్యాయతలీల నిచ్చుటకు నాస్థనుఁ జూపెసముత్సుకంబునన్.

శా. ఆయుస్సత్వసుఖాయురున్నతులు సమ్యగ్గ్లీలఁ బెంపొందగా
నాయీశాది సమస్తదేవతలు ప్రేమానంద పూర్ణాత్ములై
సాయంబౌదురుగాక వీరలకు నీసద్వంశ జాతాళికిన్
గేయంబైన ప్రసిద్ధకార్యతతులన్ క్షేమంబిడన్ క్ష్మాస్థలిన్.

# స్తుతి

శా. శ్రీవాణీశ రమేశ శీతనగజాచేతోధవుల్ భూరిధీ
ప్రావీణ్యంబుల నీజగాలసృజియింపన్ బెంపనుంపంగ నే
భావాతీతుఁడు నిల్పి వారిఘనసేవల్ బొందునామూర్తి నా
కేవేళన్ విజయోన్నత ప్రదుఁడుగా నెంతేనిఁ గాపాడుతన్.

శా. శ్రీమద్దివ్యమునీంద్ర సేవితలసచ్చిన్మాత్రుఁడున్, నిత్య ని
ష్కాముండాఢ్యుఁడు నామరూపగుణ నిస్సంగుండజుండున్ జగ
ద్ధాముండయ్యును ధర్మరక్షణకు నిత్యంబున్ బ్రయత్నించు శ్రీ
రాముండీకృతి నెల్లకాలమును సంరక్షించుదాతన్ గృపన్.

కం. గణనాయకరూపంబున
గణుతింపగఁ బడుచు విఘ్నగణ వారణకా
రణచనుఁడై తగునీశు చ
రణమెంచెద నాదు కృషికరమ్ముగ ఫలింపన్.

చం. అమలినలీల నాదుహృదయాంతర పీఠమునందు నీదు ది
వ్యమహితరూపమున్ నిలిపి ప్రాంచితభక్తి నుతించెదన్ భవ
ద్విమల కృపార్ద్రదృష్టి నను వేఁగని నాకు లలిన్ స్రవింపఁజే
యుము సుకవిత్వధారను మహోత్తము లెల్లరు మెచ్చ, భారతీ!

మ. సరసజ్ఞాన కవిత్వ చూతవిటపీశాఖాస్థితుండై నిరం
తరమున్ నిస్తుల రామనామ మధురోద్యన్నామ గానంబు సుం
దరలీలన్ దిశలెల్ల హాయిగొన దద్దన్ జేయు వాల్మీకి భా
స్వర సత్కోకిల నాశ్రయింతు సుకవిత్వంబబ్బ నత్యంతమున్.

కం. వేదపయోనిధులన్నిటి
మేదురమతిమై మధించి మేలగుసారం
బాదృతి కవితలఁ గూర్చిన
యాదివ్య కళా విలాసు వ్యాసు నుతింతున్,

గీ. తక్కురగు సంస్కృత కవీంద్రతతికి మ్రొక్కి
యాంధ్రకవినేత లెల్లర నభినుతించి
భవ్యులగు పెద్దలకు భక్తి వందనమిడి
తొలఁగఁగాకవికాకముల లలివేడి.

కం. లోకంబున సత్కవిజన
లోకోచ్ఛిష్టముల నేరి లోఁగొని మను నా
కాకవికాకములను గడు
నాకాంక్షించెదను దూరమందున నుండన్.

చం. గురువులభక్తిఁ గొల్చి కవికుంజరులన్ స్నుతిజేసి దేవతా
స్ఫురదభివాదనంబిడి ప్రబుద్ధుల నాత్మఁదలంచి ధర్మవి
స్తరమగునట్టు లీచిరుకతన్ రచియింపగఁ బూనితిన్ సుధీ
వరులు రసజ్ఞగోష్ఠి సయిపందగు నాదగు సాహసక్రియన్.

ముత్య సుబ్బారాయుడు.

## కర్తృవంశాదికము

శా. శ్రీమద్వేదశిరః ప్రబోధితవచ శ్శ్రీబోధనాధుర్యుఁడై
ధీమత్ స్తోముఁడు సర్వకర్మవిదుఁడున్ దివ్యత్తపశ్శాలి స
ర్వామర్త్యస్తుత భూరిసద్గుణగణోద్యత్ప్రాభవభ్రాజితుం
డై మానీశ్వరుఁడౌ వశిష్ఠుఁడతులఖ్యాతి న్వెలుంగొందెనున్.

గీ. అతి విమలమైన శాంతశమాదిసుగుణ
మంజరీ కలిత సకలామర్త్యమర్త్య
భోగజాలురై యశమును బొందఁగనిరి
ధీవిశాలతమించు మైత్రావరుణులు.

గీ. వేదవేదాంగ వేదాంత వివిధమార్గ
విమల బోధనవర్తన సుమహిత చరి
తాఢ్యుఁడననొప్పి కడు మెప్పునొంది మిగుల
నెగడి పొగడునుగాంచె కౌండిన్యమునియు.

శా. ఏగోత్రంబిల వీరలాదిబుధులై యేపార నొప్పారు నా
త్యాగౌదార్యరమాపునీతవిలసత్కౌండిన్య గోత్రంబునన్
జాగున్ ముత్యసమాఖ్యఁగ్రాలు నొక వంశంబందు జన్మించె నెం
తే గోమొందుచుఁ బల్లయాహ్వయుఁడు సర్వేశప్రపత్తిన్ గడున్

చ. అలహిమశైలజా మృదుహృదంబుజ నాయక పాదవారిజా
తలలిత బంభరుండయి సదానిగమాగమ దివ్యపాండితీ
విలసితుఁడైన యవ్విమలవిప్రునికిన్ నరసాంబకున్ మహో
జ్వలమతు లిర్వురాత్మజులు సంభవమందిరి దృగ్యుగంబునాన్.

చం. విమలవివేకి యవ్విదితవేద్యుఁడు వేంకటరామసోమయా
జి మొదటిపుత్త్రుఁడై యశముఁజేకొని యజ్ఞముజేసి మించెఁ దా
నమలమతిన్ ద్వితీయుఁడు మహత్తర సూనృతవాగ్విలాసియై
విమల యశోన్నతిన్ గనెను వేంంటరామ సమాఖ్యుఁడెంతయున్

కం. ఆ వేంకటరామునకును
నా విమలుని వెలది సుబ్బమాంబకు గొడుకున్
దేవీత్రితయంబనగా
నావిర్భవ మొందిరి ముపురాత్మజలులలిన్.

గీ. ధాతకరువులలోన విఖ్యాత దాన
ధర్మములుఁజేసి మించిన దైవసముఁడు
మాన్యగుణుఁడు సుబ్బారాయ మహితకీర్తి
యెలమి వేంకటరాముని జ్యేష్ఠసుతుఁడు.

ఉ. శ్రౌతమునందు స్మార్తమునఁ జక్కనిపాండితిమించి సర్వసం
ప్రీతిమెలంగి క్షీరపురిఁ బెద్దగఁగ్రాలిన సుబ్బరాయ వి
ఖ్యాతుని కల్లసోమమయు నా· నరసాంబయు లక్ష్మిదేవియున్
బూతలు సోదరీమణులు భూరియశః పరిపూర్ణ లెంతయున్.

సీ. "భూసురాన్వయ శుక్తి ముక్తాఫలంబు నా
జనియించి యామ్నాయసమితి నెల్ల
సాంగార్థముగ దాము చదివి శిష్యాళికి
నధ్యాపనము చేసి రార్యసభల
కాటకంబున నొక్కటకణమైన యర్థుల
కిడనిచో దివ్యాన్న మిడిరి వీరు
వేంకట రామాఖ్య వెలసె నెవ్వారుధాత్రి
వితరణమ్మున కర్ణు వెరగుపరచి

గీ ఆయనకు సుబ్బరాయాఖ్యు డవతరించె
జీర్ణదేవళముల బాగుచేయుటలును
పేదలకు వివాహములు గావించుటలును
పెరకు సాయపడుటలును వీరివేడ్క."

శా. ఆవంకన్ సుకవీంద్రులెందరో తదీయంబౌ చరిత్రంబు సం
భావింపన్ గనియున్ నిగర్వియగు సుబ్బారాయ ధీశాలి సీ
తావామాంగిని సాధ్విగాఁగొని సుపుత్రశ్రేష్ఠులన్ ముగ్గురన్
దావాహ్నిత్రియమట్లుగాంచి ఘనమోదంమొప్పఁగా వర్ధిలెన్

శా. శ్రౌతస్మార్తములందు వైద్యమున చంచద్ధర్మశాస్త్రంబునన్
జ్యోతిశ్శాస్త్రమునందు, బ్రజ్ఞ, గడు విజ్ఞుల్ మెచ్చఁగాఁబొంది వి
ఖ్యాతిన్ గాంచెను రామలింగ లసదాఖ్యస్ జ్యేష్ఠుఁడాముగ్గురన్
జేతోమోదముఁగాఁగ జేకొనితమిన్ శ్రీసుబ్బమాంబాసతిన్

ఉ. కోరి తనంతనే నడచి కూరిమిఁ జాపపయిన్ బరుండి వే
సారికిఁబోయివచ్చు నొక యోధునిమాదిరి బంధుమిత్రులన్
జీరియొకొక్కరిన్ గని ప్రసిద్ధములౌ హితముల్ వచించి యే
వారును బల్కరించకుడు వంతను చెందకుడంచుఁబల్కి సు
స్ఫారమనంబుతో నుపనిషత్ప్రవచనంబొనరించి ప్రాణముల్
ధీరతవీడు నీఘను సుధీమహిమోన్నతి ప్రస్తుతిన్ గనెన్.

కం. ఆ ముప్పురఁగటపటివాఁ
డా మాన్యుడు వేంక్టరామయాఖ్యుఁడు వెలయున్
గామేశ్వరీ సతీయుతుఁ
డామోదకరాంతరంగుఁడతిధృతిఁ ఘనుడున్.

చం. నిజపురి కేబదామడను నిల్వగనై మృతిపై కొనంగ న
క్కజముగ నప్రియత్నముగఁ గానగనౌ తన దత్తపుత్త్రితోఁ
డఁజనువుమీఱఁబల్కుచు హరాద్విధి, శాంతముమీఱఁదారకో
గ్రజపముతో మృతింగను నఖండపవిత్రుఁడు తన్మహాత్ముడున్.

ఉ. స్వాయదమేయకీర్తియు నవార్యమన స్తనుదార్ఢ్య శోభితుం
డాయత లౌకికాగ్రణి నిరంతర తారకనామ చింతనా
మేయ మతిప్రభాసురుఁడు మేదురవర్తనుఁడైన సూర్య
నారాయణమూర్తి మజ్జనకుడందున మధ్యముఁడుత్తమాత్ముడున్

చం. తలగడ యెత్తు జాలరిట దాపుగనుంచు మటంచుఁబిల్చి ని
శ్చలమతి నాయెడిన్ దలను జక్కగ జేరిచి జ్యేష్ఠసోదరుం
డెలమిని వేదశీర్షములు నింకొకప్రక్కనుఁ దారకంబు నేఁ
బలుకుచునుండ సర్వహితబంధులుఁ జుట్టును జేరినిల్వ గుం
డెలపయిఁ జేయివైచికొని తీవిగ శాంతమనంబుతోఁడఁ గ్రొ
జ్వలగతిఁ దానుఁదారకముఁబల్కి యకుంఠితహాసవక్త్రుఁడై
యలఘువిధిన్ శరీరమును హాయిగ స్వీయగృహంబునందు ని
స్తులగతివీడు మనఘజ్జఁ దొరపుఁబుణ్యముఁ బ్రస్తుతించెదన్.

ఉ. న్యాయపథానువర్తిని యనంత మహీసుర దత్తనిస్తులా
మ్నాయచయున్ దపోనిధి ననారతవైదిక ధర్మశీల ధౌ
రేయు సమస్త సద్గుణగరిష్ఠు విశిష్టుఁ దుష్టు సూర్యనా
రాయణ దీక్షితాహ్వయుఁ ధరామర వంశవరిష్ఠుఁ దండ్రిగన్.

ఉ వేదనగంబుఁగాఁగ బృథివీతలమందు సమస్త దిక్కులం
దాదరగౌరవాదులు మహత్తరుఁడై కనకావధానియున్
మేదురకీర్తి యుక్తుఁడు నమేయ మహోత్తమ ధర్మ కార్యదీ
క్షాదళితాఘజాలుఁడగు కామయయున్ బినతండ్రులై తగన్.

సీ. జ్యోతిష భైషజ్య సత్కవిత్వకళాప్తిఁ
గాంచెడి వేంకటరమణమూర్తి
అతులిత సంస్కృతవ్యాకరణాది శా
స్త్రములఁ బోధించిన రామమూర్తి
అతులోపనిషదర్థతతిని హిందీఁ బ్రజ్ఞ
నలరారు సూర్యనారాయణుండు
ఆస్థానముల భూరియశమందుచున్న సం
గీతశాస్త్రజ్ఞుండు కృష్ణమూర్తి

గీ. భ్రాతలుఁగఁగాంచెఁ గాల్నాధభట్ట వంశ
దీపమైన కామేశ్వరీదేవి తనదు
సాధ్విగాఁగఁ జేకొనుచు మజ్జనకుఁడెలమి
సర్వవిధ సౌఖ్యజాలము లుర్విఁగనియె.

ఉ ఈశ్వరభక్తినిన్ గడు నిజేశ్వరభక్తిని మించి సౌమ్యగా
విశ్వనుతాఖిలార్యగుణపేటిగ మేటిగ సాటివారిలో
శాశ్వత కీర్తినిన్ గనిన సాధ్విని నాజనయిత్రియైన కా
మేశ్వరినిన్ మదీయపిత మేదురభక్తిఁ దలంచిఁ మ్రొక్కుదున్.

క. వినయముభక్తియురక్తియు। బెనగొన బిట్టభినుతింతువిమలతరయశో
ధనులును విజ్ఞానఖనులు।ననఘనవినుతిఁగన్నయట్టి పితరులన్.

# షష్ఠ్యంతములు.

కం. శ్రీకరునకు ముక్తి పద
శ్రీకరునకు భక్తజన వశీకరునకు మో
దాకరునకు జయకరునకు
శ్రీకాకుత్థ్సాన్వయాబ్ధి శీతకరునికిన్

కం. ఖండిత చంద్రాంకధను
ర్దండునకుద్దండకీర్తి తతిపూర్ణ బ్ర
హ్మాండునకు కాండ కాండో
చ్చండితరిపుషండునకు యశశ్శౌండునకున్.

కం. పృథుల రఘువంశదుగ్ధాం
బుధిపూర్ణ సుధాకరునకు మునివరకథిత
ప్రథిత చరితాప్రకరునకు
బుధనుత కళ్యాణ సుగుణపూతవరునికిన్.

కం. వనజోపమ నేత్రునకును
వనజభవాద్యఖిల దివిజవారవినుత పా
వన జీవన ఘనునకు యా
వన జాతకుగుణభుజంగ పక్షీంద్రునకున్.

కం. శ్రీరామునకు మునిమనో
భోరుహధామునకు భుక్తిముక్తిప్రద సు
స్ఫారిత నామునకు, దనుజ
వారవిరామునకు భక్తవరరామునకున్.

గీ. పాదనీరేజయుగ సమర్పణముగాగఁ
గడువినయ మొప్పనిపుడు బల్కఁగనున్న
యట్టి నిశ్శ్రేయసానందమనెడి కావ్య
మునకు గల కథాక్రమ మెట్టిదనినఁ గ్రమత.

---

## కవిగారి ఇతర గ్రంథములు.

**1 భక్తితత్వసుధాలహరి** :- దేహత్రయ అవస్థాత్రయము, ముక్తిస్వరూపము, కర్తృనిరూపణము. జీవేశ్వరనిర్ణయము. మాయానిర్వచనము. సిద్ధపురుష లక్షణము. మున్నగునవి పరిభాషాపదరహితముగా సుబోధకముగా గూర్పబడిన ప్రార్థనాపద్యములు.

**2 హితైషిణి** :- ఆత్మవిద్యాపరీక్షి, తదాప్తి. ఆనందస్థాన, నిర్వచనము, తదాప్తి ఆత్మనిరూపణము, మతమునకు వైజ్ఞానిక ప్రపంచమున గలస్థానము. మతమునకు మానవాభ్యుదయమునకు గల సంబంధము. సంపూర్ణమానవత్వ లక్షణము. మొదలగునవి సుగమముగ వ్రాయబడినవి.

3 విదుషి :- పద్యములలోనవల. దైనందిన, సాధారణజీవనమునందాదర్శప్రకారప్రవర్తన మెట్లుసాధ్యమో సాధించినగ్రంథము.

4 సంవర్ధనము :- పద్యములలో పక్షరాజకీయములందు పొసగు సాధారణభంగములు అధికారమువహించుగాడిదలు, సభలోకుక్కలు ధనోన్నతులో నిరుపేదలు, పండితులలోని పశువులు, గృహిణులందసతులు, మున్నగునవి సవిమర్శముగ, గూర్పబడిన చిత్రమగుకథ.

వలయువారు :-

ముత్య సుబ్బారాయుడు
**పాలకొల్లు**
పశ్చిమగోదావరిజిల్లా (అని వ్రాయవలయును)

# నిశ్శ్రేయసానందము.

## ప్రథమాశ్వాసము.

క॥ శ్రీమద్వాణీశ రమే
శోమేశ్వరరూపరక్షితోత్తమ విబుధ
స్తోమా సకలోపనిషద్ధామా!
రఘువంశసోమ! తాపసకామా! 1.

క॥ "శ్రీమంతంబును భాస్వ
ద్ధీమత్సేవ్యము సమస్తదిగ్వ్యాప్తయశ
శ్రీమంతము వైజ్ఞానిక
ధామంబును నగుచు భారతక్షితియొప్పున్. 2

క॥ కలుముల కాటపట్టు బుధకాండము చేరెడి రచ్చపట్టు శ్రీ
కలితులచేతిపంట యధికారమదాంధుల కగ్గిమంట తన్మై
లలనకుఁ బూలదండ విమలశ్రితకోటికి పైడికొండయున్
ఖలతృణపాళికిన్ జ్వలనఖండము భారతఖండమెంతయున్. 3

శా॥ కర్మప్రాభవమున్ వివేకము నశక్యంబైన యాత్మస్థితిన్
ధర్మాంతర్గతమర్మముల్ తెలిపి శాస్త్రస్తోమముల్ చేవమై
తీర్మానించి సమస్తదిక్తటములన్ దెల్పెన్ గడున్ మించి యే
కర్మంబిప్పుడు హిందుదేశమిటు వెన్కన్ బట్టె నన్నింటిలోన్? 4

క౦॥ శ్రీ నొనఁగూర్చెడి వేళల
నూనుచు ధర్మం బధర్మ మోడకు మని యెం
తేనియుఁ బలుకుచుఁ గొందరు
కాని పనులొనర్తురేమి కర్మమొ జగతిన్ ! 5

చ౦॥ అనవరతంబు మృత్యువెదురై చరియించుచునుంటఁ బోవు వే
ళను దనవెంట నెన్నఁడుఁ గొలందియురామి, ధనంబు దుఃఖభా
జనమనియున్ సతంబెఱుఁగఁజాలియు బిట్టు నహంకృతిన్ ధనా
ర్జనమును దుష్టరీతులుగ సల్పును మర్త్యుఁడిదేమిమాయయో! 6

ఉ॥ వేషమునూని నాటకము వేయు నరుండు తదీయ వేషసం
తోషము చేత నైజపుఁదనున్ మఱపొందుచు నాట్యపోషణన్
దూషణమొందు భంగిని తనుత్వము నొందిన వాను. తన్నుఁదం
ద్వేషము రంగమున్ మరచి బేలగనౌ నరుడేమి మాయయో! 7

గీ॥ వాహనము నెక్కి తద్వైభవముల మఱిగి
దిగవలయుచోటు మరచు వెడగును బోలి
యేదొ కారణముగఁ గొన్న యీశరీర
విషయముల మున్గి తనసత్యవిధము మఱచు ! 8

చ॥ ఎటనొ వనంబులందు వసియించెడి కొందఱఁగూర్చి కాని, యొ
క్కటనొకజాతిఁగూర్చియు నొకానొక సంతతిఁ గూర్చి కానియీ
స్ఫుటమగు వేదశీర్షఘనబోధజనించె నె, యెల్లవారునం
తటను సమస్తకర్మములఁ దద్దయు గాంచగ గాని నిచ్చలున్! 9

క॥ లో వెలిఁదానును నాత్మయె
గా విమలవివేకము మెయిఁ గనుఁగొని ఘటితం
బౌ విధిని స్వీయకర్మము
గావించు నసంగు లెసఁగఁగా భువి దివియా! 10

ఉ॥ ఏది సమస్తపక్షహిత మిద్ధజగత్పరితోషదంబు నం
చాదిమునుల్ వచించిరో తదాగమశీర్షనిబోధితాంచితా
హ్లాదపథంబు వీడికొని స్వార్థమనంబులఁ దోఁచు మార్గమే
యాది వచించుచున్న నదియుత్తమమా పథమై ప్రపంచసౌ

ఖ్యోదయకారి కాగలదొకో మఱియున్ వెతఁగూర్చుఁగాని! సుం
తే దడ జెందకుండవు సుమీ నిగమాంతవిచారశూన్య సం
వాదము లెందు సంస్కరణపట్లనె కాని సనాతనప్రబో
ధాదులయందు గాని విధియంతటివాడు కడంగియుండినన్ !

గాదని యొక్క వేళఁ గడుగాసిలి సంస్కరణంబొకండు ను
త్పాదనఁజేసి యున్నఁబ్రతిభన్ బ్రకటించి సనాతనంపు ధ
ర్మాదుల నొండువట్టి యడియాసఁ బ్రచారము సల్పినన్ మహా
ఖేదమె యెట్టకుంగలుగఁ గేవలనూత్నవిధానయత్నమం
దేఁదిగజేయు, మాదిరుల నేటికిఁ దెల్పుఁగ! నెన్ని యెన్ని ధ.

ర్మాదులు చూచుచుండగ రయంబుగ మారుచునుంట లేదు? ధీ
భేద మతప్రతాది బహుభేదము లన్నియు వేదశీర్ష సం
చోదిత ముఖ్యసూత్రము లసూయలచే విడనాడి స్వేచ్ఛమై
సోదరులం దొకానొక రశుభ్రమనంబుల స్వార్థకాంక్షచే

బోదలఁపు జనించు చెడుపోకడ లన్నియుఁ బోయి చాతురిన్
వైదికశాస్త్రజాలముల వాని సమర్థనఁ జేయఁజూచుచున్
జోదుల మంచహంకృతుల శూన్యవివాదములందు మున్గుచున్
భేదమె వృద్ధిఁజేసికొని బిట్టును జెట్టలఁ బుట్టఁ జేయుటన్
గాదె జనించుచుండెడు! నఖండబలంబుల నార్యధర్మముల్
మేదిని నుద్ధరించిన నమేయ ఫలమ్ములుగల్గు. శాంతి సం
పాదన కింతకంటెను నుపాయము లేదు, ధరిత్రి ధీరులౌ
సోదరులందు భూరిసుగుణోన్నతులందు మతప్రచారణా
హ్లాదమనస్కులందు సముదంచిత సంస్కరణాభిలాషులం
దాదరమొంది యీవిషయ మాత్మల నిల్చెడి నేని భూరిస
మ్మోదమె యెల్లెడం గలిగి పూతతరంబగు దేశమన్నిటన్!"

శా॥ ఈరీతింగడుఁ గర్ణపేయముగ నెంతే సూక్తి రావంబు లే
తేరం దత్స్వర మంగనాస్వనముగాఁ దీర్మానమున్ జేసి కాం
తారంబం దబలాస్వనం బెటులు సందర్భించె నంచంచితుం
డా రాజన్యవతంసుఁ డచ్చెరువుతో నావంక వీక్షించుచున్. 18

గీ॥ బహువిధలతాంత సౌరభవంత మగుచు
జల్లనగు పిల్లతెమ్మెర మెల్లవీవ
సత్త్వగుణశోభితానేక సత్త్వతతులఁ
గనుచు నా వైపునడచె నమ్మనుజవిభుఁడు!

మ॥ వనమున్ తాలతమాలసాలకదళీపాలాశపున్నాగచం
దనచూతాతిమహీజభాజనముఁ బ్రోద్యన్మౌనిసిద్ధాదిస
జ్జనవాక్సారవిహారపావనముఁ జంచత్పల్లవాహారసం
జనితానందవిహంగజీవనము భూజానీంద్రుఁ డీక్షించుచున్ 20

సీ॥ చిత్రమణులు లేక చిత్రకారులు లేక
నిజరమ్యత నెసంగు నెమలిగములు
జ్ఞానచింతన లేక ధ్యానవాసన లేక
యానందమునఁ జెందు హరిణగణము
ఏధనంబును లేక యే జనంబులు లేక
యుత్సాహమొందు ఖగోత్కరంబు
పరివారములు లేక పరిహారములు లేక
యారోగ్యసంపూర్ణమా తలములు

గీ॥ పరగు నుపవనముఁ గనె నృపవరుఁ డచట
సహజనిర్మలానందపు సరుకుకొట్టు
ప్రకృతిరమణీయతలకును రచ్చపట్టు
నలఘుతర తపోమంత్రాళి కాటపట్టు. 21

శా॥ ధీరస్వాంతుని నైన నొక్క త్రుటిలో దీనాత్మునిన్ జేయు నా
క్రూరవ్యాఘ్రమృగేంద్రసంకులమహాఘోరాటవీమధ్య మం
దా రాజన్యుడు కాంచె మోదమున శాంత్యానందవిజ్ఞానసు
స్ఫారప్రాభవశోభితోపవనమున్ జంచత్తపస్థానమున్. 22

కం॥ చాటున మాటలు వినఁబడు
చోటటకు సమీపమందె చొప్పడియున్నన్
దీటగు బాటలు లేమి ని
రాటంకపు చుట్టు దారి నాతడు చనియెన్. 23

శా॥ ఆనీతాఖిలపుష్పగంధపరితుష్టానేకచేతంబు సు
స్థానోద్భూత నదీవినిర్మలజలస్నానపవిత్రీకృతం బమం
దానల్పోర్మిహతిప్రభూతఘనమాంద్యస్ఫీతముగ్ శీతమున్
ఘ్రాణశ్రేణిమనోహరంబు నగు సద్వాతంబు తగ్ బిల్వగ్ 24

గీ॥ సరసకిసలయసత్ఫలాస్వాదసమ్ము
దితవివిధపక్షిసంతానరుతము వినుచు
నతులితానంద జనక దృశ్యములఁ గనుచు
మెల్ల మెల్లగ నరిగె భూమీధవుండు. 25

కం॥ కుడిభుజ మదరుటయును న
వ్వడువున నదురుట నెసంగు భాగ్యఫలం బ
య్యెడవిని నెటుకల్గునో యని
కనునాలోచించు చరిగె గాలి తెరలోన్ 26

మ॥ వలనొప్పన్ బుధచంద్రు లయ్యెనుడు సద్వారంబు సంచారముల్
సలుపన్ సద్ద్విజగానరాజి సుమనస్సౌఖ్యంబు నభ్రాభమున్.
ఫలసంధాయకభూజపంక్తియును భవ్యశ్రీ మగుద్వాహినుల్
వెలయన్ విష్ణుపదంబుమ్రొకెవన మొప్పెగ్ మోదపూర్ణంబునై .27

గీ॥ సుమశరమ్ములఁ గురియించి సుందర మగు
శోభలగ్ మీరి యామ్రపసూనవరుని
యంగభవతాపహారకమైన దగుచు
రామమైయొప్పె నవ్వనసీమ మిగుల. 29

సీ॥ ఫలభారనమ్రమై వరుస నిల్చు కుజాళి
వినత భటావళి ననుకరింప
నవనిరాలిన పూవు లాకులుగ్ లలిమీరి
వరుసదీర్చిన రంగవల్లు లనఁగ

నల్లిబిల్లిగ నల్లు పల్లవపాళి
చలువపందిరి లీల వెలయుచుండ
నందందు రాలు రమ్య కుసుమగుచ్ఛాళి
సన్మాన సన్నాహ సరణిఁ దోప

ద్విజరుతముమంగళధ్వని వీకఁ దసర
గంధవాహుఁడు ముందుమార్గంబుఁజూప
నడువఁ దొడఁగెను పుడమిఱేఁ డడవి నడుమఁ
గందుటలు మ్రింద డెంద మానంద మొందఁ. 29

కం॥ ఆలోనఁ గుజముసీడల
నాలోకించెను నృపాలుఁ డతిరుచిరతనూ
లీలన్ స్వజనకసేవా
శీలన్ ధృతమాల విమలచేలం బాలన్ 30

కం॥ స్వర్ణమయభూష లేకయుఁ
బర్ణసుమాదులనె తాల్చి భాసిల్లెడు సం
పూర్ణరుచిరయగు నవ్వర
వర్ణినిఁ గని భూమిజాని స్వాంతమునందున్. 31

శా॥ 'జంబాలోత్పలకంబుబింబమహిభృజ్జంబూ ఝరీజాంబుకం
జంబుల్ యావకభృంగళోష్ఠకుచకేశస్తోమవాగ్దేహావ
క్త్రంబుల్ కన్గొని యెండి వాడి చెడి కృత్తంబై జడంబైయప
ధ్యంబై నీచగమై యగంధమయి వ్రయ్యల్ వారెఁదత్సన్నిధిన్ 32

ఉ॥ తమ్ములనేలు కన్నులు సుధాకరునేలు మొగంబుఁ దేంట్ల మొ
త్తమ్ముల నేలనౌ కురులు దాడిమిగింజల నేలు పండ్లు న
భ్రమ్మును నేలు కౌను రుచిరమ్మగు నంగకముల్ కడానిమే
నిమ్మగుకుల్కుగుబ్బలహా! యింతటి రమ్యతఁగంటి నేయెటన్!' 33

కం॥ అని యిటు లనేకరీతుల
ననుపమ రమణీయగాత్రి యందము నెంతే
మనమునఁ దలపోసికొనుచుఁ
దన యెదుటికి జరిగె నతఁడు తద్దయుఁ బ్రీతిన్. 34

ఆ॥ నభమునందుఁ గల ఘనఘనాఘనము పొంత
మెలఁగు మెఱపు కరణి మెఱయుదాని
నంగధృతవిభూతియౌ తజ్జనకు మ్రోలఁ
దనరు కనకగాత్రిఁ గనియె నతఁడు. 35

మ॥ ప్రభుచంద్రుండు సమీపమందె కడునాత్రిం బుప్పతిల్లంగఁ బూ
ర్వభవోపార్జితభూరిపుణ్యఫలసర్వస్వంబు నానన్యదు
ర్లభసౌందర్యవిభాసితాంగి యగు తద్రాజాస్య నీక్షించి 'ప
ద్మభవుం డేరికి మీఁదుగట్టెనొకొ దా తత్కన్య!' నంచెంచుచున్. 36

ఉ॥ చిత్రితరూపమో యజుఁడు చేఁతబయల్పడ దృష్టనద్వనీ
చైత్రముగాసృజించిన పసందగుసుందరమూర్తియో యనం
బాత్రితఁగన్న నవ్యసుకుమారశరీరనుగాంచి 'యీలతా
గాత్రియెపో వివేకసుధ గాననునిం చెనటంచు నెంచుచున్. 37

కం॥ ముదుసలిఁ గదియఁగఁ జను న
య్యదనున ననుపమలతాంగి యవనతముఖయై
యొదిగె నొకకుజమువెనుకకు
బెదరుచునున్నట్టి తళుకుబెళుకుం గనులన్. 38

ఆ॥ కదిసి నృపతి భక్తిగదుర నమస్కృతిఁ
జేసి గౌరవంబుఁ జెంది వృద్ధు
డచట జూపినట్టి యాసనంబునఁ జేరి
యెఱుఁగ జేసి తన్ను నిట్టులనియె. 39

మ॥ "భుజపీఠస్థితకార్ముకాంకములు సంపూర్ణాస్యవర్చస్సు గాం
చ జనేశాన్వయులంచుఁ దోఁచెడిని, చంచద్వేషభాషాదులన్
సుజనస్తుత్యతపస్వివంశ్యులని తోఁచున్, మీర లెవ్వార? లిం
దుఁ జరింపం గత మేమియొంటిమెయి సంతోషంబునన్ దెల్పరే!40

ఉ॥ రూపము విద్య శీలము నిరూఢిగఁ బోఁతనుబోసి యయ్యజుం
డేపును గౌశలంబు వెలయింప సృజించె ననంగ నొప్పుచున్
రూపునుఁబట్టి కన్యగ నిరూపణఁజేయఁగ వచ్చు నీలస
ద్రూపిణి యేమికావలె నెరుంగఁగఁజేయరె మాకు నెమ్మితోన్!"41

కం॥ అని ప్రశ్నింపఁగ నాతఁడు
మునుఁ గాశ్మీరపతియాట మొదలు తపోవాం
ఛను నటవిఁజేరు టాదిగఁ
దనచరితముఁ దెల్పి పిదపఁ దరుణి విషయమై. 42

శా॥ "ఐదారేడుల ప్రాయమప్పు డిట నియ్యబ్జాక్షి మాతల్లిచే
నీదుర్గాంతవనానఁ ద్రోయఁబడి సుంతే స్వీయజన్మస్థలం!
బౌ దేశంబగు కోసలన్ జనఁగ నూహంజేయ దా రాజభో
గాదుల్ గోరదు నాటఁగోలె సుతచాయన్ నిల్చె నాచెంగటన్.43

కం॥ గానముల ప్రోవై రూప
మ్మునఁ జరితను నమలమైన పుణ్యావతిని నీ
పెనుఁ బ్రేమఁబిలిచి కొనుచుం
టిని నేను, ధరాధినాథ! నిశ్శ్రేయసగన్. 44

శా॥ మాద్యద్దంతి సమానగామినికి నీమాన్యాంగలావణ్యస
ద్విద్యాశీలగుణస్వరూపఖని కేదీశాత్మునిన్ గూర్చినన్
మద్యత్నంబు ఫలింపఁ గల్గునని సంభావించి యొక్కొక్కటన్
మద్యోగాభ్యసనంబుగూడ మరతున్ సత్యంబు, రాజోత్తమా!45

శా॥ ఆలోకింపఁ ద్వదీయలక్షణము లీవాపెట్ మదిన్ గోరునా
లీలన్ గోచరమయ్యె నీముఖకళల్ వీక్షింప నౌదార్యస
చ్ఛీలాఖ్యాండవటంచుఁ దోఁచు, నయినన్ క్షేమంబుకా దిట్టులీ
బాలన్ నిర్ధనరాజ్యహీనఁ గొనుటల్ భావింప నీబోంట్లకున్. 46

కం॥ కయ్యం బాడెడు వేళను
వియ్యంబును బొందఁ జూచు వేళను మిగులన్
నెయ్యము సలుపఁగఁ బోయెడు
నయ్యెదనున సములె వలయు ననుటను వినవే!'' 47

కం॥ అని యోగి పలుకుచుండఁగఁ
గని ఘనవేణియును చాటుగా నిల్చియె యా
మనుజవరుఁ గన్నుఁ గొనలనె
కనుఁగొనె తనగుట్టు బయలుగాఁ గుతుకమునన్. 48

మ॥ తొలిదృష్టిన్ బ్రిభవించియున్ బెనఁగి యుద్బుద్ధంబు నుద్రిక్తమై
తెలివిం బొల్చి త్రిపందరిఁగియున్ దేకెక్క పేమంబుతో
మిళితంబైన కటాక్షవీక్షణము నెమ్మిన్ మేదినీకాంతుపైఁ
గలువల్ దండగనై కడింది యతనిన్ గైసేసె నొక్కుమ్మడిన్ 49

కం॥ ఆమాత్రి మంత్రితుంబలె
నే మాత్రాకాల మామహీపతి జడుఁడై
మైమరచి తేరి తదుపరిఁ
దామానసమందు నిట్లు తలపోసెఁ గడున్. 50

శా॥ ''నానారాజకుమారికామణుల విన్నాణంబు వీక్షించు నాఁ
డేనాఁడున్ జలియింపకున్న దిటమౌ నీ నామనంబిట్లు నేఁ
డీ నారీమణిపైని వ్రాలి మఱిసుంతే వీడి రాదేల! క
ర్మానీతంబిదిగాఁగ నోపు!'' నని యూహాం జేయుచున్ ముగ్ధుడై.

చం॥ సుమశరసంప్రచారముల చొప్పులు సుంత యెఱుంగకుండ జ
న్మము మొదలిట్లు వన్యహరిణప్రియపోతములందుఁ గూడి త
త్సమముగ వృద్ధినింగనెడు సారసలోచన యయ్యె నద్వితీ
యమృదువచోవిలాసముల నందఱమించెడు నీమె వింతగన్. 52

కం॥ క్షణమాగి యోగివరు నీ
క్షణమాత్రము చేత నెఱిఁగి సకలవిమల ల
క్షణమాన్య కన్య కంజే
క్షణ మానసమందుఁ గోరి సవినయరీతిన్. 53

ఉ॥ "అంతరదృష్టి సర్వవిషయమ్ము లెఱుంగఁగఁ జాలు మీరలి
ట్లింతగ దీనిఁ గూర్చి వచియించు తెఱంగును గాంచ నన్ను న
త్యంతము హెచ్చరింప నిటులంటిరొ, కాక పరీక్ష సేయఁగా
స్వాంతమునం దలంచిరొ యటంచు నె తోఁచుఁ దపోధనాగ్రణీ!" 54

చ॥ అని వచియించులోన సచివాదులు రాజెట కేగెనో యటం
చు నటవియెల్లెడన్ వెదకుచున్ బొదమాటుననుండి యమ్మహీ
పుని స్వనమాలకించి వెఱపున్ జనవున్వినయంబుఁ దోఁప నా
తని దరికేగుదెంచి విహితంబగు రీతిని మ్రొక్కి నిల్చినన్. 55

కం॥ ఒడయఁడు నుడివిన నుడువులఁ
బడతుక యెడఁదయుఁ గడింది వడిఁబొడఁగని య
వ్వడువున నుడువఁగఁ దొడఁగెను
బొడమిన తమి వెడలిపడఁగ ముని కడుహితుఁడై. 56

మ॥ "అనయంబున్ నినుఁగూర్చి యీపరిసరంబందెంతయున్ గొప్పగా
వినియుం ద్వద్వదనాంచితప్రబలగంభీరప్రభావాదులన్
గనియున్ స్నేహవిధిప్రకారముగఁ బల్కంగోరియే యిట్టులే
ననియుంటిన్ గొనఁబోకుమిద్ది యితరంబౌ జాడ డెందంబునన్'77

చం॥ అని రచియించి మాని వికచాంబుజలోచనఁగాంచి యాపెనె
మ్మనమును లక్షణాదులు ననూనముగా గ్రహియించి మించు వే
డ్కనుగనె దూరమందు నచటన్ దరియన్ వెరపొందు కోయ క్రొ
న్ననవిరుఁబోఁడులన్ విమలనాకసతీసమసుందరాంగులన్. 58

చ॥ కనుడిదె కాంచె మీసఖి యఖండపురాకృతపుణ్యసత్ఫలం
బనియననౌ మనోహరు ననన్యసమాన నృపాలమౌళి, నీ
తని కిల నీమె యీమెకు నితండును నన్నిట నుద్దియై కడున్
వనరుహజన్మసంఘటన పాటవమున్ వెయినోళ్ళఁ జాటరే! 59

ఉ॥ కీర్తిత వర్తనం బలరు గీష్పతితుల్యమతిప్రభావుఁడై
వర్తిలి యార్తిహార్తయును భర్తయు నౌచు విదేహకంచిత
స్ఫూర్తిని రత్నకూటపురి ముఖ్యపురమ్మయి క్రాలనెంతయున్
గీర్తినెసంగునంచు నలు క్రేవల నేవినియుంటి సీతనిన్, 60

చం॥ నగరములందు నెంతయు ఘనమ్మని విజ్ఞులు పల్కఁజెన్ను వా
రఁ గలిగె రత్నకూటనగరమ్ము కరమ్ముఁ బురమ్ములందు నె
న్నగఁ దగినట్టి భూరిసుగుణాలఁ బరస్పర మున్నతిప్రదం
బగు పథమందు వర్తిలగలట్టి సతీపతిపుత్రపాళితోన్. 61

ఉ॥ ఆపుర మేలు రాజు తన హైమకరావళిచేఁ బ్రజాసుఖ
ప్రాపకుఁడౌట రాజెయగు వైభవదాముఁడు నౌట రాజెయౌ
నేపున దుష్టవృత్తులలయించి భరించుచునుండి రాజెయౌ
బ్రాపయి రక్షఁజేయుచును రాజెయనన్ వినియుంటి సీతనిన్. 62

శా॥ నానారీతుల సర్వముఖ్యవిషయాంతర్వర్తియయ్యున్ రవం
తే నెవ్వారలఁ బక్షపాతమును గ్రోధేర్ష్యాదులున్ లేని ని
త్యానంధంబునఁ గ్రాలనేమొ జనులందానందనాముండు గా
భూనాథుండు ప్రసిద్ధిఁగాంచె విబుదుల్ పూర్ణంబుగా మెచ్చగన్. 63

ఆ॥ సకలవిబుధవినుతసచ్చరితుఁడైనను
సతులరూపవిభవుఁ డాఢ్యుఁడయ్యు
మదికినచ్చునట్టి మదిరాక్షి దొరకమి
బ్రహ్మచర్యమింతవఱకు విడఁడు. 64

ఉ॥ అందమునందు భావములయందుఁ బ్రవర్తనమందు సత్కులం
బందు గుణంబులందు సముదంచితవిద్యలయందు నెన్నికో
రందగు కన్యకామణి ధరన్ గనరామిని నెందరెందఱో
సుందరమందగామినులఁ జూచియుఁ బెండిలియాడఁ డింతకున్. 65

మ॥ మననిశ్శ్రేయస భూరిసద్గుణమతిన్ మానిత్వమందున్ బ్రవ
ర్తనమందున్ సకలంబునన్ బతికిదద్దన్ దుల్యయై పొల్చియీ
ఘనదాంపత్యము ధారణీస్థలికిఁ జొక్కంబైన యాదర్శమై
తనరం గల్గుటఁ దోఁపఁ జేయుఁ గనుఁడీ తత్తత్ప్రభాశోభలన్!" 66

కం॥ ఈరీతి మాని పలుకఁగ
నారాజీవాక్షు లెల్ల రనిమిషలీలన్
వారిరువురిఁ గన దొడఁగిరి
తీరని తమకంబుతోడఁ దియ్యంబెసగన్. 67

ఆ.వె॥ యోగివరుని సన్న యోషలు గ్రహియించి
నూత్న దంపతుల ననూన వివిధ
సూనమాలికాది శోభితులుగఁ జేసి
హర్షమంది రంతరంగములను. 68

చం॥ కడు జయరావముల్ సెలఁగఁగాఁ గరతాళములున్ ముదాన నె
క్కుడు చెలరేగ యోగి మదకుంజరయాన కరమ్ము రాజుచే
నిడి శుభసూక్తులం బలుక నిర్వురు మాలలఁదీసి మార్చుకోఁ
గడఁగిరి సూనవర్షము లఖండముగాఁ గురియింపఁగా సఖుల్. 69

మ॥ అట నయ్యోధ్యటవికుల్ కనంబఱచు ప్రేమానందభక్త్యాళి ము
చ్చటఁ గై సేతయు నుత్సవప్రతతి నెంచన్ శక్యమే! యెల్లరున్
దుష్టిటిసర్వస్వము గూర్చి పెండ్లి మహీపాదుల్ మెచ్చఁగాఁజేసి ర
చ్చటి యావింతల వైభవాదులకు హర్షంబంద వారెల్లరున్. 70

ప్రత్యక్షర చలజిహ్వా నిరోష్ఠ్యము.

ఉ॥ నీరజజాది నిస్తులిత నిర్జర రాజ సునిశ్చితస్థితిన్
సారధృతిన్ నుతింగొను ననంతరసోత్తర! సత్తనూజితో
స్నీరద! ధీరశీర్షధృతనిస్తుల శాసన! దోషశోషణా!
సారచరిత్ర! ధైర్యజితసానుధరా! ధరణీసుతాసఖా! 71

స్రగ్విణి

జానకీహృత్సరోజాతఖద్యోతనా!
మానితోదారసన్మౌని యోగీంద్ర వి
జ్ఞానిబృందారకాకాంక్షితాంచద్గుణా!
దీనభక్తావనాధీనచిత్తాంబుజా! 72

స్వాగత. స్ఫారధీరనుతసద్గుణసీమా!
వీరదైత్యకుల భీకరనామా!
వారిజాప్తకులవారిధిసోమా!
సూరివంద్యగుణసుందరరామా!

గద్య:—

ఇతి శ్రీరామానుకంపాకటాక్ష లబ్ధ కవితాధౌరేయ కౌండిన్యగోత్ర
పవిత్ర ముత్యవంశపయఃపారావార రాకాసుధానిల
య కామేశ్వరాంబా సూర్యనారాయణార్య
తనయ విబుధవిధేయ శ్రీ సుబ్బరాయ
ప్రణీతంబైన నిశ్శ్రేయసానంద
కావ్యమందలి ప్రథమాశ్వాసము.

సమాప్తము.

శ్రీ

# నిశ్శ్రేయసానందము.

## —: ద్వితీయాశ్వాసము :—

కం॥ శ్రీకంఠ ధనుర్భంగ
ప్రాకటలీలావిశేషరంజిత సీతా
స్తోక ప్రేమకటాక్ష బ
హూకృతకల్యాణరామ ! యోగిస్తోమా ! 1

శా॥ "శ్రీకంఠ ప్రదరాసనార్దనలసత్ క్రీడోల్లసత్స్వాంతసీ
తాకాంతామణి ప్రేమవీక్షణములన్ ధర్మాత్ములౌ వారు ల
స్తోక ప్రేమ నొసంగు నక్షతల సంశోభిల్లి సంతుష్టుఁడౌ
నా కళ్యాణరఘూద్వహుండు మిము నిత్యంబోముగాతన్ గృపన్!" 2

కం॥ ఇటు పరిపరి విధములఁ బ్ర
స్ఫుటముగ నాశీర్వదించి భూమీపతి నా
దటఁ గన్గి యిటు పలికెను ముని
పటుబుద్ధివిశేషవైభవ మ్మెసలారన్. 3

కం॥ "ఈ వెలుగని యర్థంబులు
భూవలయములోన నుండఁబో వయినను నా
భావమునకుఁ దుష్టికలుగఁ
గా వక్కాణింతు విను మకల్మషచరితా! 4

చం॥ కనుపసిబిడ్డయీవు, యవుఁ గాదన నేర్వదు పట్టణంపుసం
దడులకుఁ గ్రొత్త, మాయిక మనఃపరిశీలనమన్నసున్న, నీ
సడిగని వర్తిలంగలుగు శక్తియు నున్నటుతోఁప దేను నీ
యెడఁదవిశాలతంగని వహించితి ధైర్యము సుంత పంపఁగన్. 5

మ॥ సకలంబౌ నిగమాంతశాస్త్రగరహస్యంబుల్ గడున్ బూర్వజ
న్మకృతంబౌ ఘనపుణ్యహేతువున సంపాదింపఁగాఁగల్గె నీ
యకలంకాత్మ, పవిత్రనంబునను దానారీతినే గ్రాలు నం
టకు శంకంగొనఁ గాని పిన్నవయసౌటన్ సుంతయోచించెదన్. 6

ఆ.వె॥ తల్లిదండ్రిలేని తలిరాకుబోఁడిని
నగరమెఱుగనట్టి నాతి ఖిన్న
నిన్నినాళ్ళు పెంచి యిప్పుడు నీచేతఁ
బెట్టుచుంటి నోట్ల ప్రేమఁగనెదో! 7

కం॥ తనతలిదండ్రుల వీడుచు
ఘనసోదరబాంధవపరికరము విడుచుచున్.
దనదు సఖులవీడుచు సతి
దనపతిసన్ జేరు టొక్క దాస్యమునకొకో! 8

కం॥ కోమలశరీర లౌటను
గోమలతరకార్యరచనకున్ గోమలలున్
భీమంబగు కార్యంబుల
క్షేమంబిడఁ బూరుషులునుఁ జెలఁగుదురు కదా! 9

గీ॥ స్త్రీయధర్మంబులనుఁ బూర్తిచేయుపట్ల
నొకరొకరి మించి జగతికి నుపకరించి
యిలను నావందనిలయమై వెలయఁజేయు
మిధునమేసుమ్ము గణనీయ మిధునమనఁగ. 10

గీ॥ ఒకరొకరిపైని యధికారమూనఁబోక
యేరిసద్ధర్మములయందు వారు దెలివిఁ
జెలఁగుచుందురె స్వాతంత్ర్యసిద్ధి సుమ్ము!
అదియె లోకాభ్యుదయ హేతువైన విధము. 11

కం॥ సతి పతియందును దత్పతి
సతియందును సర్వమయునిఁ జక్కనఁ గనుచున్
ధృతిమెయిఁ బరస్పరసహా
యత నాత్మవివేక మొప్ప నార్జింపఁ దగున్. 12

కం॥ తనసతి తనయెడ నెటు మనఁ
దనకింపగు నటులె తానుఁ దప్పక యెపుడున్
దనసతి యెడలను నడువఁగఁ
గను నిర్మలుఁడౌకఁడె సూవె ఘనుఁ డనన్నొప్పున్ 13

కం॥ వైవాహిక సంస్కారము
కేవల తాత్కాలికమగు క్రీడయయిన దే
హావసరపు సంబంధము
గా విమలవివేకి గనఁడు ఖలమతి తక్కన్. 14

మ॥ తమ వౌ దేహమనఃప్రవృత్తులను నధ్యాత్మప్రవృత్త్యాళి ను
త్తమ పుత్త్రాదుల భావిలోకవిమలత్వప్రాభవాళిన్ బ్రపం
చమునం దన్నిట జోక్యమున్నదగు సంస్కారంబెయౌ పెండ్లి జో
క్యము సంఘంబునకున్ మతంబునకు లేదంటన్ నిజంబున్నదే! 15

మ॥ ఒక కుక్షింభరతాపరియోజనము నే యూహించుచున్ భోజనా
దికముం గూర్చుట, కామవాంఛలనె తృప్తింగోరి పెండ్లాడు. టా
ర్థికలాభాప్తికె విద్యనేర్చుటయుఁ, గీర్తిప్రాప్తివాంఛన్ బరో
పకృతిన్ జేయుట మూర్ఖకృత్యములుగాఁ బల్గంగ నాలింపవే! 16

చ॥ మహితసుఖాసుఖంబులు సమానముగా వహియింపఁ దోడుగా
విహితవిధుల్ పొనర్చి సుఖవీచులఁ దేలఁగ మంచిజోడుగా
సహితభవాబ్ధి దాటఁ బ్లవమై తనరారు సతీమతల్లినాన్
బహుసుఖసాధనంబయిన వట్టి యచేతనవస్తువే కనన్! 17

చ॥ గృహిణియనంగ స్త్రీయుఁబరికింప గృహస్థుడ వీవునోఁటచే
గృహమునకీవె నాథుఁడవు కేవల మామె తదీయదాసి యం
చహితములౌ తలంపులను స్వాంతతలంబునఁ జేరనీక స
ద్విహితగతిన్ గనుంగొనుచుఁ బ్రేమనుగౌరవమొందుచుండుమా 18

చం॥ ఎవరిమతానవారు తమకే యితరుల్ కడులోఁగి వర్తిలం
గవలె నటంచు నందులకుఁగా నవమార్గము లెంచికొంచునుం
టవలనఁ గాదె కాఁపురమనన్ నరకంబటుతోఁచు నైజని
త్యవిమలసౌఖ్యవర్తనకు దవ్వయి, భూపతి వంశదీపకా! 19

ఆ.వె॥ సౌఖ్యనరకములకు సతియే కారణమాట
జాడలెరిగి సతిని వాడవలయు
సతికి సర్వగతులు సమకూరకున్న చోఁ
బతికి దేశమునకు భద్రమున్న ? 20

కం॥ మణికంకణమున నాకం
కణమును మణిచేత నొప్పు కరణిని నీ స్త్రీ
మణి నీచే నీకన్యా
మణిచే నీవును నమేయమాన్యతఁ గనుఁడీ ! 21

చం॥ పస నిలనొప్పుచున్ శిశులభర్తల నిల్పుచు దైహికంబు మా
నసికముఁ దాత్వికమ్మును ఘనంబగు శక్తులయందు స్వచ్ఛతన్
రసభరితమ్ము రంజనకరమ్ము రమాయుతమై కరమ్ము సం
తసమిడు గీము గోము నిడు నల్యాగురీతినిఁ జెల్వఁ దేవతెన్. 22

కం॥ సతిసాయమునన్ సమ్మతి
ధృతిమై పితృదేవమానిఋణముక్తిని గాం
చి తరించు నుపాయముఁగని
చతురత వర్థిల్లి సుఖయశంబులఁగనుమా! 23

కం॥ అని యిటు లానరపతి మా
లినిఁ గూర్చి వచించి మాని లీలగనా బా
లనుఁ గని పలుకఁగఁ దొడఁగెను
ఘనమృదుగంభీరరీతిఁ గౌతుక మెసఁగన్. 24

కం॥ పూతుఁడు సుగుణాన్వితుఁడు
ధూతప్రపంచకోగ్రదుర్మార్గగుణ
వ్రాతుఁడు ప్రతిభాతీతుఁడు
ప్రీతిమెయిన్ బలుకఁ దొడఁగెఁ బ్రియసుతఁ గనుచున్. 25

చం॥ గురుకులవాసమందెఱిఁగి కొన్న మహత్తరతత్త్వమెల్ల భా
స్వరగతి సర్వమాక్రియలఁ బాటిలఁ జేయ గృహస్థమార్గమే
యిరవగు నాశ్రియంబగుట నీవు తదగ్నిపరీక్షయందుఁ జె
చ్చెర జయశీలవై యశముఁ జేకొనుమమ్మ, కుమారికామణీ! 26

చం॥ నరులును సందడుల్ గనని నట్టడవిన్ బ్రబలాగమాంత వా
క్సరణి మెలంగునీవు జనసంఘములందు సమస్తవైభవా
భిరతులయందు నెట్టులు గభీర సునిశ్చలితానుభూతివైఁ
బరఁగెదవో కనన్ మహితవైభవమబ్బెనటంచు నెంచుమా! 27

చం॥ ఎవరు కలట్టి సర్వధన మీశ్వరభిక్షగ నెంచి యంటకెం
దు విముఖులై మహాధృతిని దుఃఖసుఖంబుల లెక్కలేక తా
మవికళరీతి నాత్మనిభులౌదురొ వారె ప్రపంచజన్యదు
ష్టవికృతులందుఁ గూలక యశస్సుఖముల్ గనుచుందు రెప్పుడున్. 28

చం॥ ఎఱుఁగుదు రెల్ల వారు పరులెవ్వరికేనియుఁ జెప్పువట్ల గ్రం
థరచనలందు నీతి, తమదైనిక జీవనమందు నీతి మా
ర్గరతిని వర్తిలంగను నఖండవివేకగుణాఢ్యుఁ డొక్కఁడేఁ
ధర స్తవనీయుఁడౌ బుధుఁడు దానిమతిన్ విడఁబోకు మెప్పుడున్! 29

చం॥ పతిహితకార్యవర్తనలపట్లను దాసిని, యోచనాదులన్
హితసచివున్, సురూపముననిందిర, నోర్పునఁబృథ్వి విందులం
దతులితమాత, హాసశయనాదులరంభనుఁ బోలి నాథు సం
తతసుఖవార్ధిఁ దేల్చి గురుతంగను మెల్లపు డిందు నందునన్. 30

చం॥ సకలకళావిశేషములఁ జక్కని విద్యలభేషజంబులం
బ్రకటితలీలనేర్చి గృహరాజ్యము నెల్ల స్వతంత్రవృత్తిఁ గొం
కక నడుపంగలట్టి యధికప్రతిభాదులనొంది సాధ్వి భ
ర్తకు శిశుపాళికిం బహువిధంబుల బాసటగావలెం గదా ! 31

మ॥ పతియం దీశ్వరభక్తి పిన్నలయెడన్ వాత్సల్యశక్తిన్ భట
ప్రతతిన్ భూతదయాప్రసక్తి సమమర్త్యశ్రేణిరక్తిన్ గుమా
ర్గతతిన్ భూరివిరక్తి ముక్తిని గనంగాసక్తియున్ యుక్తియున్
సతతానందముఁ బండితాదరము నిచ్చల్ గల్గి వర్ధిల్లుమా ! 32

మ॥ బలవిద్యాగుణశీలసంపదలచే భాసిల్లి కాంతామత
ల్లులు స్త్రీధర్మము నెందు నిల్పఁగలరో లోకంబు నందందెనా
వెలయున్ సౌఖ్యపరంపరల్ సతము భావిప్రాభవోపేతరీ
తుల స్త్రీయార్భకపాళిఁ బెంచుపని యెందున్ వారియందుంటచేన్.

చం॥ ధనము ఋణమ్ము దోషతతి దానము మాన మగౌరవంబు నా
స్థను గృహలోపపాళి మతితాపము వృత్తిరహస్యముల్ సుమం
త్రినిచయమున్ బయల్పఱుపరామి యెఱింగి సతీపతుల్ సతం
బును వెలయన్ వలెన్ బరులపోడిమి నోర్చి సమున్నతస్థితిన్. 34

గీ॥ ఒకరిగౌరవోన్నతుల కింకొకరు భంగ
మావహిలనీక ధర్మనిత్యతనుఁ బ్రబలి
తగుపరస్పరాభ్యుదయసాధనము లనఁగ
దంపతులు మన్న భువి స్వర్గతలముగాదె! 35

చం॥ పతిసెడెనంచుఁదానుసెడి భర్త యలక్ష్యము సూపెనంచుఁ దా
నతుఁల విలక్షణంబుఁ గొని యాతఁడు విద్దెను మానఁ దాను మా
ని తలిరుఁబోఁడికింటె నతినీచత నాతఁడు వాని కంటె నీ
చత విరిబోఁడియున్ గొనుచు సంఘము నొంచగరాదు దీనతన్"

కం॥ బహురీతుల నిటు లాముని
తుహినకరాననుఁ గాంచి తోషమ్మునఁ బె
క్కుహితమ్ములఁ బల్కి సుతా
సహవాసినులదెసఁ గాంచి సరభసలీలన్. 37

కం॥ పరిచయముమాత్రినే మన
మెరియునువిడ మనకుఁ గన్న నెట్లుండునోకో
యరయఁగ సహవాసమునకు
సరియగు సంగంబులేదు జగతిం జూడన్. 38

కం॥ తనయావియోగభవయా
తన నెల్లను మాని బహువిధంబుల నిటు చిం
తనఁజేయుచుండ నరపతి
తనపురముంజేర యత్నతత్పరుఁ డగుటన్. 39

శా॥ ఆకాంతామణితోడ నాతని పురప్రాంతంబుఁ జేరంగ వా
రాకాంక్షన్ బతిమాలినన్ ముని యరణ్యంబందె నిల్వంగఁ దా
సాకల్యంబుగఁ గోర్కిఁ బూనుటను రాజన్యుండు తత్సేవకై
చేకూర్చెన్ గడుయోగ్యమైన భటరాజిన్ దద్వనాంతమ్మునన్. 40

చం॥ సకలజనంబులన్ దగిన చాయల తేఁడు బహూకరించి మా
నికి వినయంబుతోఁప నతినిం బొనరించి వధూసమేతుఁడై
ప్రకటజయధ్వలుల్ చెలఁగ వాహనమెక్కి చమూసమూహ మ
త్యకలుమభక్తి వెంటఁ జన నాత్మపురాభిముఖంబుగాఁ జనెన్. 41

మ॥ భువనానందముగాఁగ షోడశకళాపూర్ణేందుఁ డారోహిణీ
ధవళాక్షీమణినట్టు లామెఁగొని భూదారుండు తేరెక్కి చుం
డ వియోగంబున కోర్వలేక మదిమంద్రాటంబునున్ బూని యా
యువతీలోకము యోగియున్ నిలిచి రత్యుత్కంఠ నిశ్చేష్టులై. 42

మ॥ వనితాలోకముఁ దదృషిప్రవరుఁడున్ స్వాంతంబు పర్వుల్ గొనన్
గనుచున్ నిల్చిరి మంత్రముగ్ధులటు రంగప్రేక్షకుల్ వోలె నా
తనిఁ దత్స్యందనముం దదీయవితతధ్వానంబుఁ దద్ధూళిఁ ద
ద్ఘనచక్రాదికచిహ్నముల్ క్రమత నంతన్ వట్టియాకాశమున్. 43

కం॥ ఇరుదెసలనుండి వదలిన
యిరువునకే పొగనువిడుచు చేగెడి పొగబం
డ్లరహిని వెనుకకె దృష్టుల
మఱలించుచుఁ జనిరి రెండువైపుల వారల్. 44

కం॥ ప్రజలెల్ల సంతసింపగ
సుజనస్తుత భూపుఁడరిగె సురుచిరలీలన్
నిజపట్టణాభిముఖుఁడై
ధ్వజములు బిట్టెగురుచు శుభవార్తలఁ జాటన్. 45

చం॥ 'భళిమనరాజువచ్చె' ననువారు 'వియోగముదుస్సహంబుఁగా
మెలఁగితి' మన్నవారలు 'నమేయగుణాన్వితయైన లేమ ని
మ్ములగొనినాఁడు మంచిదియె పో!' యనియెంచి ముదంబురాశివీ
చులఁ గడుఁదేలి నిర్మలత శోభిలువారును నైరి తత్పురిన్ 46

కం॥ తమయేలిక యొకతన్వినిఁ
దమిఁబెండిలియాడి పురికి దాపైన యుదం
తము నెఱిఁగి జనులు తమతమ
తమకంబుల నుత్సవప్రతతిఁ బ్రకటింపన్. 47

కం|| తత్సమయంబున వారల
యుత్సాహము ప్రేమభరము నుత్కంఠయు నా
యుత్సవములుఁగైసేతలు
తత్సంతోషమును దెల్ప ధాతకువశమే ! 47

కం|| నవదంపతులను కనుగవ
నవలోకించిన జనంబు లయ్యిరువురి రూ
పవిలాసభూరిసంప
త్సవిశేషంబులను మిగులఁ జొక్కెడువారై . 48

ఉ|| అన్నిటికన్న నిత్యమును నన్నిరవద్య పవిత్రవర్తనంబునం
దెన్నికఁగన్న సద్గుణము లెన్నియొ చూఁచుటచేత నామెఁగ
న్గొన్నజనంబు, రూపమునుగొన్నగుణంబులపుంజమంచు లే
మ న్నుతిఁజేసి బిట్టుమది మన్ననసేయనివారు లేరటన్. 49

ఉ|| ఆమెయుఁగూడ డంబము నహంకృతియుఁ గరువంబు నాదిగా
నేమియు దుర్గుణంబు లొకయింతయు లేక సమస్తజీవులం
బ్రేమను గౌరవించుచు ననేకవిధంబుల నెల్లవారిలో
గీమున వన్నెకెక్కె మనెఁ గేవల ధార్మికమూర్తియో యనన్. 50

ఉ|| పిన్నలఁ గన్నబిడ్డలుగఁ బెద్దలఁ దద్దయు దేవునట్లుగా
నెన్ను సతీలలామ యెప్పుడెంతయు మారని హర్షచిహ్నపుం
గన్నులలేమ సర్వజనగణ్యతనొందినరామ స్వప్నమం
దు న్నయరీతివీడని వధూమణి యామె యమేయ యెందులన్. 51

చం|| ఘనచరితాఢ్య తా నచిరకాలములోననె యెల్లవారి మ
న్ననలనుఁ బొంది సర్వసుగుణంబుల ప్రోవగుచున్ నిజేశు నె
మ్మనమును జూఱఁగొఁగలిగి మంజులవాగ్విభవాభిరామయై
యనితరసాధ్యసద్యశము నందెఁ గడించియు రాజ్యమంతటన్. 52

మ॥ పురమం దేయొకమూలనో యొకఁడు సంబోధించి నిశ్శ్రేయసా
తరుణీరత్నము జన్మవంశము జనిస్థానంబుఁ బ్రశ్నించినన్
వరరాజ్ఞీమణి సద్గుణప్రతతియుక్ భవ్యస్వరూపంబు నె
ల్లర ముగ్ధాత్ములజేసి తద్విషయమెల్లన్ మర్వఁజేసెన్ గడున్. 53

మ॥ సకలైశ్వర్యములందియున్నను దదైశ్వర్యమ్మునన్మగ్ని స్వీ
యకథన్ విస్మృతినొంద కామె తన కామైశ్వర్యవారాశి కం
తకు సంబంధము గుర్తెఱుంగుటను దద్సంగాన సమ్మోహ మొం
దక యవ్యాజంబగురీతి వర్తిలి దిగంతఖ్యాతిఁ గాంచెన్ గడున్. 54

చ॥ ఉరమున నర్ధదేహమున నూరువునందు ముఖమ్మునందు స్వీ
యరమణులన్ వహించిన యనంతరసోత్తరులౌ మహామహుల్
వరయుగమందు బిట్టుఁ గనుబట్టు పరస్పరమైత్రియున్ దమిన్
గరుణయు స్వేచ్ఛ మున్నగు గుణంబులఁ గన్గొని వింతనొందరే! 55

గీ॥ సంపదాదులసంగంబు చాలఁ గలిగి
స్వీయసత్యంబు విస్మృతిఁ జేయలేదు
సంపదాదుల సంగంబు సడలఁజేయ
సంపదలఁ దృణీకారంబు సలుపలేదం. 56

మ॥ అనయం బన్నిటియందు మోదము నెయన్యోన్యంబు సేకూర్చుచున్
ఘనవిశ్వంబును బ్రేమదృష్టి సతమున్ గన్గొన్చు విశ్వంబుచే
తనుఁ బ్రేమంబునఁ గాంచఁగాఁబడుచు నేతద్దంపతుల్ రూపమం
దిన యీఆనందరసమ్ముగో యనగ నుద్దీపించి రెంతేనియున్. 57

మ॥ కమనీయోత్తమ హాసశోభిత లసత్కంజాత వక్త్రంబుచే,
నమృతంబున్నిరసించు స్వచ్ఛమృదుభవ్యప్రేమ వాక్యాళిచే,
నమలంబైన విశాలమానసముచే నాపద్మపత్రాయతా
క్షి మనోనాథుని మానసమ్మున కతిక్షిప్రమ్ము గానెక్కెడిన్. 58

కం॥ రమణీయత ననుకూలత
నమలిన మానసమునందు నన్నిట సమమై
యమరిన సతి గల పురుషున
కమరేశత్వమ్ము కెట్టి హాయిని గూర్చున్. 59

మ॥ బలవిద్యాధన రమ్యతాదుల సమత్వంబబ్బి పద్మాక్షి యి
మ్ములనెంతే ననుకూలమై పతికి నింపుగా గూర్చుచేపొల్చి వా
రలకారోగ్యసుఖాయువుల్ విధికృపార్ద్రిసాంతులై కూర్ప ని
శ్చలతన్ వారలు కాలఁదన్నరె సురేశత్వం బలక్ష్యంబునన్! 60

ఉ॥ ఆధరణీశుఁడుగా గృహమునం దిటు మోదమహాబ్ధిఁ దేలుచున్
బాధలఁబాపి స్వప్రజల భవ్యసుఖమ్ములఁ దేల్చుచుగా ప్రజా
రాధితుఁడయ్యె నన్నిటఁ గరమ్ము సమర్థతఁ గ్రాలి లేఁడు భూ
నాథులయందుఁదత్సముఁడనన్ యశమందె సమస్తదిక్కులన్. 61

చం॥ అతిసుకుమార! మారజనకా! జనకామ! కామదాహకా
శ్రిత! శ్రితపాల! పాలితశచీహృదయేశ! దయేశ! యీశసం
స్తుతఘననామ! నామపరితోషితసమ్మునికాండ! కాండని
ర్జితరిపుధీర! ధీరగుణసింధువరా! వరజానకీవరా! 62

సుగంధి. భానువంశవారిధిక్షపాకరా! మనోహరా!
దానవేంద్రభూరిగర్వతాడనప్రభావరా!
మానిశేఖరస్తుతోత్తమప్రభావభాసురా!
జానకీసతీహృదంబుజాతదివ్యభాస్కరా! 63

మాలిని. అమలినమృదుహాసా యర్కకోటిప్రభాసా !
విమలకమలనేత్రా ! విశ్రుతోద్యచ్చరిత్రా !
సుమతి వినుతనామా ! సూర్యవంశాబ్ధిసోమా !
విమతతతివిరామా ! విశ్వవిఖ్యాతరామా ! 64

ఇది శ్రీరామానుకంపాకటాక్షలబ్ధకవితాధారేయ కౌండిన్య
గోత్ర పవిత్ర ముత్యవంశ పయఃపారావార రాకా
సుధానిలయ కామేశ్వరాంబా సూర్యనారాయ
ణార్య తనయ విబుధవిధేయ
శ్రీ సుబ్బారాయ ప్రణీతం
బైన నిశ్శ్రేయసానంద
కావ్యమందలి
ద్వితీయాశ్వాసము
సమాప్తము.



శ్రీ

# నిశ్శ్రేయసానందము.

## —: తృతీయాశ్వాసము :—

కం॥ శ్రీ జానకీసతీ హృ
ద్రాజా! రాజాధిరాజ! రాజితతేజా!
తేజోమయ మునిదివిష
ద్భ్రాజా! భూజానిరాజిపూజితరామా! 1

మ॥ ఋణమున్ వహ్నియు మేఘమున్ జినుఁగు నెంతేఁ జిన్నదై తొల్త దా
రుణమౌ రీతిని వృద్ధియై పిదప మీఁజున్ గాదె కష్టాళిఁ బ్రే
రణమున్ జేయుచు! నల్లె శంక తొలిఁ బ్రారంభించుచో స్వల్ప కా
రణమై పిమ్మట వృద్ధినంది నెతఁ గూర్పంజాలు నెవ్వానికిన్. 1

చం॥ తరుణి క్రమాన పూర్ణహిమధామసమాస్యను బుత్రికామణిన్
గరము సురూపసంపదలఁ గంతు జయంతులఁ గేరు పుత్రు, భా
సురగతిఁ గాంచి వర్ధిలెడు చొప్పున గన్గొను భాగ్యమబ్బుటన్
బురజనులందు వర్ధిలెడు మోదము మేరనుఁ దెల్ప శక్యమే? 3

చం॥ క్రమమునఁ గొంతకాల మటు కాగ జనంబుల మోదమంతయున్
సమయఁగఁ జిత్రమొప్పఁగ విచారము, నీసు, నగౌరవంబు, ద్వే
షము జనియించి వృద్ధియయి సర్వజనంబులఁ జేరుచున్ సభా
ళి ముఖమునన్ బయల్పడి బలీయముగాఁ గననయ్యె నెల్లెడన్. 4

చం॥ ఎటు జనియించి యుండెడినొ యేరు నెరుంగఁగ లేని యామె తా
నటు తమ రాణియౌటయుఁ దదాత్మజుఁడున్ దమ రాజ్యమేల నుం
డుటయును మేలుగాదనెడి నూతనభావము లుప్పతిల్ల సం
కటపడి రెల్లరున్ గ్రమముగాఁ బురిఁ జిన్నలుఁ బెద్ద లచ్చటన్. 5

చం॥ ప్రేమంబూనిన యేని రాజు కడు సంప్రీతిగ వివాహంబు నే
భామారత్నమునైనఁ జేసికొనుటల్ భావ్యంబగున్ గాని మా
సీమన్ బాలనసేయ నుత్తమకులస్త్రీరత్న సంజాతుఁడో
ధీమంతుండె సమర్హుఁడంచు మహిలో ద్వేషంబువారొందుటన్. 6

గీ॥ గుజగుజలు మారి పైసభాగోష్ఠిఁ జేరి
యాయసమ్మతి పత్రికటన నధిగమించి
సాముదాయక విజ్ఞప్తి సరణి మాటి
క్రిమత మంత్రిపుంగవుని నిర్బంధపఱుప. 7

ఉ॥ ఆ సచివాగ్రగణ్యుఁడు ధరాధిపుఁ జేరి నయంబునన్ నతిం
జేసి వచింప నూరుకొననేరక గ్రుడ్లను నీరుఁగ్రుక్కుచున్
వీసముదాఁప కెల్లెడను విస్తృతమైన సమస్తభావమున్
పూసలుగ్రుచ్చి నట్టులు నృపుండువినన్ వచియించియాపయిన్. 8

గీ॥ సర్వవిధముల యత్నంబు సలిపికూడ
వారి తీవ్రతఁ దాను మార్పంగలేమి
తెలిపి కలిగిన ముద్దుబిడ్డలను వదలు
నెడల నుంత శాంతించునం చెఱుకపఱుప. 9

మ॥ ఒడయం డద్ది సమస్తమున్ విని తదీయోద్వేగసర్వస్వమె
క్కుడు శ్రద్ధన్ గమనించి తాఁ బ్రజలపైఁ గోపంబునుం బూన క
ప్పుడఁతిం దత్కుల గౌరవంబుఁదన శేషన్ లాతులూహించు నె
ప్పుడశక్యంబగుటన్ దదీయవచనంబుల్ యుక్తమే నంచుఁదాన్ 10

మ॥ "తలకొని యామె జన్మము విధమ్ముఁగలట్టులు పైకిఁ దేఱ ని
చ్చలుఁ బొనరించు యత్నములు చక్కఁగ సాగెడిలోన నింత లిం
తలుఁ గడునాపరాకపయిఁ దార్కొను నివ్విధిఁ గాంచ సర్వరీ
తుల విధిచోదితంబనియె తోఁచును నాకది మార్పశక్యమే! 11

కం॥ కోసలదేశములో నీ
నా సంగతి బయలుసేయ నతిచతురత నెం
తేసలుపు ప్రబలయత్నము
లీసరికి ఫలించి యున్న నిది కలుగునొకో! 12

చం॥ ఎటువిధి తోఁచియు నావిధిన యేగుచు నాపఁగరాని దానినో
పుట విధికార్యమై యెదుటఁ బొల్చెడు కార్యము జంకులేక యా
త్కటమతి స్వార్థబుద్ధి మమతల్ విడిచేయుటకాక నుంతమా
ర్పుటకును వేగిరించుటకు శూలికి శక్యమె? మంత్రిశేఖరా!" 13

కం॥ అని యిటు కొన్నిటి సంగతు
లను విశదముగాఁగ నయ్యిలాపతి యామం
త్రినిఁగాంచి పలికి పిమ్మట
మనమున యోచించి నుంతమారని ధృతితోన్. 15

కం॥ ఏతత్సమస్తముం దన
నాతికెరింగింపఁ గోరి నరవరుఁ డా భా
మాతిలకముగల సౌధము
నాతతధృతిఁ జేరె సచివు నటకున్ గొనుచున్. 15

ఉ॥ "జంకఁడు చీరికిం గొనఁడు సంఘము వేగిరపాటు చెందె స్త్రీ
వంకననండు సుస్థిరతఁ బాయఁడు హాసయుతాస్యమందుఁ గో
పాంకము లేనిఁ దేఁడు విధియట్లు విధించె ననండు. బాపురే!
శంకరుఁడైన నాతనికి సాటియె సుస్థిరమానసంబునన్! 16

గీ॥ భృత్యులును ఘనప్రేమైకభాజనులును
అమలులుఁ బసికందులునుఁ బ్రాణాధికులును
నైన కన్నబిడ్డల వీడ నడుగు నపుడు
కందుఁజెందని ఘనుఁడెందుఁ గలుగునొక్కొ! 17

గీ॥ స్వీయపట్టణ మనలంపు శిఖలఁ దగులఁ
గనుచు శాంతిమై నిలిచిన జనకుఁ డొకఁడు
పూర్వది ముండెనటంచుఁ జెప్పుదురు గాని
యట్టి నిస్సంగు నేఁడిట నరయఁగంటి. 18

ఉ॥ మంచియొ చెడ్డయో జరుగ మాటికిమాటికి దానిఁ గూర్చి యే
యెంచుచుఁ గార్యముల్ విడుచుహీనుఁడొకండు, నొకింత యెంచినన్
బ్రాంచితకార్యరాజి విడువన్ జనకుండెడు ధీరుఁ డొక్కఁడొ
క్కించుకయున్ బొసంగనటులే స్థిరుఁడౌ మహనీయుఁ డొక్కఁడున్.' 19

కం॥ ఈలీల సచివపుంగవుఁ
డాలోచన సేయుచుండ నాలో నృపుఁ డా
లోలాక్షి యెదుటఁ దెలిపెఁ బ్రి
యాలోకపుఁ గలకలమ్ము సకలముఁ గ్రమతన్. 20

మ॥ తనప్రాణమ్ములకన్న మిన్నగ ననంత ప్రేమమ్మైఁ గాంచి పెం
చిన యాబిడ్డల నిచ్చివేయుమని ప్రశ్నింపంగ నాలేమ యి
ట్లనియెన్ మెల్లన మందహాసగతి వక్త్రాబ్జంబునన్ మాన్పు నొం
దని స్థైర్యంబునుఁ దెల్పఁగాఁబతికి నుద్యద్భక్తితో మ్రొక్కుచున్. 21

శా॥ "ఈమాత్రమ్మున కేల నాకడకు మీరే తెంచి వాక్రుచ్చుటల్ !
వామాలోకము భర్తృవాక్యసరణిన్ వర్తించుటే కాని వే
రేమైన న్వచియించు టర్హమయి యున్నే ? భేదభావంబులం
దేమాత్రంబు సతీపతుల్ మనిన వారేకాత్మ్యలం బొప్పునే ?

మ॥ మనయీ వైభవముల్ శరీరములు శుంభల్లీల సర్వప్రజా
ధనవృద్ధంబులు తత్ప్రయోజననియుక్తంబుల్ తదానంద వ
ర్ధనమాత్రప్రకటంబు లౌట నవి సొంతమ్మంచు నాత్మేచ్ఛఁ ద
ద్వినియోగమ్మునఁ గాక యన్యముగురీతిన్ జేయఁగా భావ్యమే? 23

శా॥ ధృత్యుత్సాహబలాదులయ్యని మొనన్ దీపింపగాఁ జేయుటన్,
ప్రత్యూహమ్ముల రాజ్యవృద్ధికరమౌ ప్రఖ్యాత కార్యావళిన్
ప్రత్యేకంబుగ నీవిసుంగు లసువుల్ పాయంగఁగాకిట్టు లీ
యత్యల్పంబగు ప్రాయమందు విడుటన్ స్వాంతంబువంతంగొనున్

మ॥ సకలంబౌ మనసంపదాదులును నేసర్వేశుకారుణ్యదృ
ష్టికిఁ బాత్రంబయినంతఁ గల్గెడినొ తచ్ఛిన్నాశ్రుతునేర్పాటుచే
నొకవేళన్ విడనైన నందుఁగల యేవోకొన్నిటిన్ నేఁడు, దా
నికినై చింతనుఁబూను టర్హ్యగతియౌనే ప్రాజ్ఞులెవ్వారికిన్!’ 25

చం॥ అని ముదమార నిర్వురగు నర్భకులన్ బిలిపించి ప్రేమమై
ననుపమసుందరాంగులగు నాసుగుణాకరులన్ గరంబుఁ బ్రీ
తిని గడుముద్దులాడుచుఁ బతింగని బిడ్డలనొప్పగించె నా,
పిన నిల కశ్రులిర్వురకు వేఁ గడుధారలు కార నేఱులై. 26

శా॥ ప్రారబ్ధస్థితిచేఁ బొసంగెడు సుఖప్రాప్తిన్ వ్యథాప్రాప్తినిన్
స్ఫారాహ్లాదము దుఃఖమున్ గనక యెవ్వండోపఁగా నేర్చుఁ! దా
నారీతిన్ సుఖదుఃఖసంహతుల నిత్యంబుల్ గనుంగొంచు యో
గారూఢస్థితిఁ బాయకుండును బుధుం డానందసంపూర్ణుఁడై. 27

చం॥ ఇరువుర బిడ్డలన్ గొని యహీనశమంబున ఱేఁడు మంత్రి శే
ఖరుని కరమ్మునన్ గరము గౌరవమొప్పఁగ నుంచినన్ బ్రజో
త్కరములుగాంచి వారల యఖండవిరాగము నెంచి బిట్టున
చ్చెరువడి రందుఁ గొంద రిటు చేసితిమేయని కుందిరాత్మలన్. 28

ఉ॥ వారలలోన కొంద రతిభాసురబుద్ధివిశాలులంచుఁ బెం
పారినవారు ‘వారలను నా రహి మీఱ మనంగనీయ భూ
దారుని బుద్ధిమాలి పెడదారిని జేరిన, వారిఁ గ్రమ్మఱన్.
జేరిచి రాజ్యమిచ్చునెడఁ జేయునదేమి’ యటంచుపల్కినన్. 29

కం॥ క్రమమున నేతదభిప్రా
యమె యుక్తమటంచు జనములందఱుఁ బలుకు రా
సమయంబునఁ బసిపాపల
సమయించి శుభంబుఁగూర్ప సమయము సేయన్. 30

కం॥ అటు లవ్వారలు పల్కెడు
స్ఫుటవాక్యంబులకు సచివపుంగవుఁ డెంతే
గటకటపడి 'యర్భకులను
నటవికి ననుపుటలు చాలదా!' యని వారిన్. 31

ఆ.వె. వారివారి వాదవారంబులను మార్చి
ఉత్తమమగురీతి నొప్పగించి
అతిరయంబుమీర నర్భకు లిరువుర
నంపివైచె వారు హర్షమొంద. 32

మ॥ జరిగెన్ బిమ్మటఁ గొన్నివర్షము లటుల్ శాంతంబుగా నైన ను
ర్వరకున్ రాణిగ వారుకోరుకొను సద్వంశోద్భవన్ రాజు తా
నరయన్ లేదిఁక నాప్రజాప్రతినిధుల్ యత్నంబు లెన్నేని జే
సిరిగా కెందును గాంచలే రటులు వాసింగన్న కన్యామణిన్. 33

మ॥ అలినీలాలక యామె యుండ, నిఁకఁదా నన్యాంగనన్ బెండ్లికిన్
గలయంజూడఁడు ఱేఁడు. వారుగనినం కాంతామహానర్ఘఁడౌ
నలభూకాంతుని పెండ్లియాడఁగల యబ్జాక్షిన్ గనన్ జాల రి
ట్టులు గాలంబగునంచు సందడులు బిట్టున్ రేగె రాజ్యంబునన్. 34

మ॥ అతివన్ దత్పతి పూర్వరీతిగ నరణ్యంబందుఁ జేర్పించి స
మ్మతిమై వారలరీతినే సుముఖతన్ బద్మాక్షికై యత్నము
ద్ధతిఁ గావింపక రాజ్యమేలఁ గలసత్పంతాన మేరీతిగా
నతఁడొందంగలవాఁడటన్న నుడి రాజ్యంబంతను మ్రోగఁగన్. 35

చం॥ అది విని ధారుణీరమణుఁ డావిషయమ్ము సతీలలామ కు
న్నది కలరీతిఁ దెల్పుటయు నాతి సమస్తము నాలకించి నె
మ్మదిఁ బదిలంబుఁ జేసి పలుమాఱుఁ బరేశుఁ దలంచి నాథునిన్
సదమలభక్తి మ్రొక్కి సువచఃపరిపాక మెలర్ప నిట్లనున్. 36

గీ॥ "ఆగమాపాయులును ననిత్యములు నగుచుఁ
బొలుచు వైభవాదుల రాకపోక లందు
మోదఖేదాళి నరుఁ డొందఁ బోలు నొక్కొ
తనకు వానికిఁ గల్గు భేదంబుఁ దెలిసి ! 37

చ॥ జనహితకార్యమై యిది యొసంగుట, మీరలు కూడ నిట్టులే
యొనరుప మేలటంచు మది నూహనొనర్చుట, నంతకంటె నా
కు నిఁక హితంబు కల్గునొకొ ! కూరిమి మీఱఁగఁ గాన కేగి యా
ఘనుఁడగు సన్మునీశ్వరు నఖండధృతిన్ భజియింతుఁ గ్రమ్మఱన్. 38

గీ॥ అంచులకుఁ గట్టబడి నట్టి జ్యానుఁ ద్రుంపఁ
దగ యథాస్థితిఁ గొను బాణదండ మట్లు
పౌరవాసకారణములగు మీరు విడినఁ
బూర్వ వనవాసమున కేను బోదు సుండు ! 39

చ॥ ఎసఁగు సుఖాసుఖమ్ముల కొకించుక మాఱని పూర్ణశాంతితోఁ
బసమెయి సర్వకార్యముల వర్తిలఁగల్గిన మేటి నేర్పుతో
మసలఁగలట్టి మానవుఁడె మానవులం గడు మిన్న కాని యే
దెస కేదితోఁ ప్రియ నాదెస నతివ్యథఁగూలెడు వాఁడు మర్త్యుఁడే? 40

మ॥ ప్రజలం దే యొక మాటనుం బడని దివ్యంబౌ పథంబందు బి
ట్టుఁ జరింపంగల యద్వితీయ చరితాఢ్యుండైన శ్రీరామచం
ద్రు జయింపన్ దగు ధీరవర్తనులు మీతో రంపుఁదీర్ఘాన రీ
తిఁ జరింపం గని ధన్యఁగాఁగలుగుటన్ దేటెక్కు మజ్జన్మముల్"41

మ॥ అని హర్షంబు మెయిన్ వచించి మహితోద్యత్ప్రేమ నొక్కుమ్మడిన్
దన ప్రాణేశుఁ గవుంగలించికొని కాంతారత్న మొక్కింత సే
పునకున్ లోపలి కేగి భూషణతతిన్ బుట్టంబుల న్వీడుచున్
వనవాసార్హ్యపుదుస్తులంగొని ప్రయాణంబై పతింగాంచుచున్. 42

ఉ॥ "ఎచ్చట నెంతదూరమున నీతనువున్నను స్వాంత మెప్పుడున్
ద్వచ్చరణాంబుజాతముల పజ్జనె సుమ్ము నిరంతరం బిటుల్
హెచ్చగు భక్తిఁ గ్రాలెడు, నహీనచరిత్రిక ! దూర మెట్లు భా
స్వచ్చిరమైత్రి కేఁగలదు భంగ మొకింతయు నెట్టివారికిన్ !" 43

గీ॥ బర్హి మేఘంబులకు నవోత్పల హిమాంశు
లకును బద్మినీ దిననాథులకును దూర
మెంతయుండిన మైత్రి కేయెగ్గు కలిగె !
దూర మెందు సుజనమైత్రిఁ ద్రోయఁ గలదె ! 44

ఉ॥ స్వాంతము మీపయిన్ దను వవారితలీల వనంబునందు న
త్యంతము నిల్చియుండును, ధరాధిప ! పట్టునుబట్టి యయ్యయ
స్కాంతమునుండి లాగఁబడి క్రాలు నయోమయసూచివోలె నీ
చెంతనె దృష్టిగల్గి విధిచేత వనస్థలి నేను నిల్చినన్. 45

మ॥ అతులంబైన విశాలభావములు సొమ్మై మీకు పెంపారుటన్
సతినిం బిల్చి పరిస్థితుల్ తెలిపి స్వేచ్ఛన్ యుక్తమార్గంబుఁజొచ్చి
తరింపన్ దరుణంబుఁగూర్చితి, యశశ్శ్రీగోరిమాగ్నాటలన్ జతు
రత్వంబునఁ గానకంపక, కృతజ్ఞన్ నీకు, ప్రాణేశ్వరా ! 46

చ॥ సకలజనంబు సంస్తుతులు సల్పఁగ సద్గుణశోభితుండవై
ప్రకటవివేక మేర్పడగ రాజ్యజనుల్ కడుమెచ్చునట్టి సా
ధ్వికిఁ బతివై సమస్తమగు దివ్యసుఖంబులఁ బొందుచున్ బ్రజా
ళికి సుఖదాయకుండవయి లీలమెలంగుము ప్రాణనాయకా! 47

శా॥ ఏనారీమణి నిన్నుఁ జేకొనిన నేనీర్ష్యంగొనంబోను, సూ!
నేనీదాన నెగాన! నీజయసుఖానీకాదులే నావిగా
నానందించుచుఁ దద్వనాంతరములం దావాసముం జేయుదున్
నేనట్లుంటకుఁ జింతనొందకు. వని న్నే మోద మే పొందుటన్. 48

కం॥ కృపమాత్రి మెపుడు నాపై
నృపనాయక వీడఁబోకు! నీ వేగతిగా
విపినస్థలి వసియించెద
నపరిమితప్రియము నయము హర్షము నెసఁగన్! 49

శా॥ ప్రేమంబెంతయు నాపయిన్ గల మిముం బీడం మహాదుర్లభం
బై మత్ప్రాణము పోవనున్నను ద్వదీయాదేశముంగొంచు మీ
యామోదంబె మదీయమోదముగ మత్స్వాంతంబునందెంచి యీ
సీమన్ వీడుచునుంటి మీాపటమె మచ్చిత్తంబునన్ హత్తుచున్. 50

సీ॥ సురుచిరమగుచు దృష్టజనశుద్ధికరమ్ము శుభావహమ్ము భా
స్వరకరుణామయమ్ము సువిశాలము సంతతమందహాసభా
సురమును దీర్ఘనేత్రియుగశోభిత మార్యసుసేవ్యమానమై
వరలెడి నీముఖేందురుచి భావన దీపిక నాకు కానలోన్. 51

చ॥ బహు జన్మార్జిత భూరిపుణ్య ఫలసర్వస్వంబునై! ఘోరదు
స్సహదుఃఖప్రవిదారకంబు విలసత్సౌఖ్యప్రదంబున్ శుభా
వహమున్ సంతతచింతనీయమగు నీపాదాబ్జయుగ్మంబుబ్రి
త్యహమున్ ధ్యానముఁ జేసి కొందుబలమున్ దత్తాన నేనొందగన్"

చ॥ అని నృపమాళియొద్ద సెలవందుచుఁ బిన్నలమందహాసరా
జిని, ఘనులజ్జనతిన్, సముల శ్రీకరదృష్టిని, గౌరవించుచున్
వనికిఁబ్రయాణమై చనె నృపాలుఁడు మంత్రికి నర్థరీతిమై
వని వనితామణిన్ విడిచివచ్చుట కాజ్ఞనొసంగి పంపఁగన్. 53

క॥ తప్పనిసరిగాఁ దనపై
నప్పని భారంబుఁ బడుట కాపగనుంతే
నప్పుడు శక్యముగామికి
నప్పట్టునఁ జింతమున్గి యాసచిపుండుణ్. 54

శా॥ కార్యోద్యోగము వారువప్రతతివే గంబున్ గడున్ మీర సా
కర్యప్రాపక యోజనావళియుఁ జక్రింబట్టుదొర్లంగ, నా
దార్యోదంచిత రాణివైపు మదియుణ్ దత్పట్టణాశన్ దదీ
యార్యస్తోమ నహార్యధైర్యఘన దేహంబున్ జనన్ గానలోణ్.

శా. నానాఁడున్ దనకావరానిగతినిన్ వ్యాపారముల్ సీమనేం
తేనిణ్ జిత్రిముగాగ మారుటయుఁ దానే మార్పునున్ జేయలే
కానారీమణిఁ జేతులారగ నరణ్యంబందునన్ జేర్పగా
నానాకర్మముఁ గాంచుచున్ సచిపుఁ డత్యంతవ్యధాపూర్ణుఁడై. 56

మ. 'యతివేషంబునఁ గోసలావనిని నేయత్నించి యెక్కెట్లో యీ
సతిమార్గల్లి యొనర్చినట్టి చెయివుల్ సర్వమ్మునున్ బైకిఁదె
చ్చితి నైనణ్ దదధీశుఁ డామెఁగనఁ బిచ్చింజెంది దేశంబుపీ
డి తదారంభముగాఁ గనంబడమి నెండెణ్ మన్మహాశాలతల్. 57

ఉ. మర్మములేని నిర్మలిన మానసమేర్పడునేని యుక్తమా
కర్మమొనర్తునేని మహికాంతునురాణియునెట్టి వేళలణ్
ధర్మముతప్పనట్టి మహితప్రతిభాన్వితులేని దేవుఁడే
ధర్మముఁబ్రోచునేని యిటతప్పక నాకృషిసాగి తీరెడిన్' 58

ఉ. గణ్యతమీరు పుణ్యుఁడయి కాపెడి దీనశరణ్యు దుర్గమా
రణ్యగమానిరాట్పుమవిరాగమనస్కుల సత్ప్రభుత్వనై
పుణ్యమునందు గణ్యుఁడగు భూపవరేణ్యశరణ్యునంత బ
హ్మాణ్యుని నట్లు జూడ మనసాడక యేమొ సనెన్ దినేశుఁడుణ్. 59

మ. దినమెల్లన్ బలశౌర్యముల్మెఱయ మందేహాదిదైత్యాళి సం
హననక్రీడను సల్పి నిజశౌర్యాటోపముల్ గగ్గఁ జే
సి, నిరాడంబరమూర్తియై కమలినీచేతంబు లల్లాడఁగాఁ
జనె దిక్చక్రముచాటుగా నినుఁడు విశ్రాంతిన్గొనన్ జూచుచున్. 60

కం. స్ఫురితతరచారుచామీ
కరహయఖురపరివృత్తరేణు ఘనరాగమునా
నరుణహరిద్గభస్తులు
ఖరకరుఁ డరిగిన పథానఁ గనఁబడె నంతన్. 61

చ. సమముగ జారచోరజనసంఘముదావహమై యటం గ్రమ
క్రమత బ్రపంచమంతయు సరాసరిగా మసిఁబూసినట్లు గా
ఢముగనుఁ గన్నుఁగన్నుగనుటల్ గడుఁగష్టమునౌచుఁదోఁప సం
తమసము నిండె నేకమునొనర్చుచు లోకము నెల్ల వేల్మిడిన్. 62

చం. సచివుమనంబునం దెసఁగె సాంద్రతమంబగు నంధకారపుం
నిచయమె రేఁగి యెట్టెదుట నిల్చినటుల్ నిబిడీకృతంబు బి
ట్టచలమునై తమంబెస్గఁగ నందునముందున కేగలేక తా
నుచితముగాఁదలంచె సచివోత్తము డందునఁ గొంతనిల్వఁగన్. 63

గీ॥ ఇనుడుగ్రుంకినతఱి రాజ్యమునను రేఁగి
పలుతెరంగుల లేచు శత్రులను బోలె
ఇనుడు గ్రుంకినతఱి నభమ్మునను దార
లొక్కఁడొక్కఁడు కనిపించె నోజవెలయ. 64

సీ॥ ప్రభుకార్యములఁ దీర్చపనిపైని
దినరాజు నిల్పఁజేసిన ప్రతినిధి యనంగ
నౌషధలతికాళినభివృద్ధినందింప
విధివిధించిన వైద్యవిదుఁ డనంగ

కలచేష్టగమనింప నలచిత్రగుప్తుండు
జగములనిల్పిన సాక్షియనఁగ
సృష్టిని సాగింప శృంగారమును బెంపఁ
గామునితోడైన ఘనుఁడనంగ

గీ॥ నఖిలజీవిజీవనసౌఖ్యప్రదుండు
మహితహిమకాంతికాంతసమస్తలోకుఁ
డనుచు ఘనకీర్తిగంటు సుధాంశుఁ డనఁగ
నలరె డంబునఁ గలువఱేఁ డంబరమున. 65

చం॥ జనహితకాంతుఁడౌ నృపతి సద్యశముల్ సితత్వమొప్పు కాం
తిని జగమెల్ల వెండికరణిన్ గనఁజేయుచు సర్వలోకజీ
వనముగ నొక్కటన్ బ్రకృతిపక్కన నవ్వినయట్లు నిండుజ్యో
త్స్నను వెలయించె లోకమునఁ దద్ధిమధాముఁడు మోహసంబుగన్

మ॥ ఒక గ్రంథాన నొక్కొక్కసంగతిని నత్యుత్సాహియై గొంచు స్వీ
యకవిత్వంబునఁ జేర్చికొంచుఁ దనదుర్వ్యాపారముల్ దాఁచు నా
కుకవింబోలుచు భాస్కరాదులకడన్ గొన్నట్టి తత్కాంతి భూ
మికిఁ జూపించుచు వెన్క భాగమును నెమ్మిన్ దాఁచుఁ జంద్రుండు తాన్.

గీ॥ తమమునందును సుఖముదృష్టమగుఁగాని
హానివృద్ధియుతమ్ము వ్యయమ్ము మితము
నంచుఁ దెలుపంగనేమొ నయ్యబ్జవైరి
యించుమించుల కాంతుల నిచ్చు దిశల ! 68

చం. అధిపులచే ముహుర్ముహురుదద్భుతశిక్షలనందుచున్న నె
వ్విధమునసైన స్వీయపదవిన్ విడలేనినియోజితుం బలెన్
విధుఁడు కళంకియై యుడుల పేరిటి సభ్యులఁగూడి యెట్టులో
కథనడిపింపఁ జూచెడును గా పదహీనుఁడు గాక చాతురిన్. 69

మ॥ తగులీలన్ దమ దేశమభ్యుదయమందం జేయ భూనాథులెం
తగ శక్తుల్ గలిగించినన్ జనులకున్ దర్పాన దుఃఖంబు నీ
యఁగ నుద్యోగితలంచునట్లు శశి యుష్ణాదుల్ దినేశాదులో
ద్దఁగొనన్ గాని జగాలకిచ్చునవి వంతల్ శైత్యకాషాదులున్. 70

ఆ.వె. అలరుబోడి ఫక్కుమని నవ్వినవిధాన
పుచ్చపువ్వులొకట విచ్చినట్లు
పిండియారఁబోయు వెరవున వెన్నెల
వెలయు వేళ మంత్రి విపినమందు. 71

మ॥ వసుధామండలమున్ సుధామయముగా భాసిల్ల సేయంగ నో
పు సుధాంశుం డుదితుండుగా సచివుడప్పూజ్యన్ మహారాజ్ఞినిన్
వెస వీడ్కొంచు దిశాతటుల్ వశెనె తెల్వింబొందు సంశుద్ధమా
నసమేపొందఁ బురమ్ము సేరగఁ బ్రయాణంబయ్యె నమ్మంత్రియున్.

శా. తద్రాజ్ఞీ భవితవ్య మేమగునా యేతన్నాయక గ్రామణుల్.
తద్రాజ్యంబున నేమొనర్తురొ నిజోద్యద్యత్న మేమానా యే
తద్రాజన్యవతంసుధర్మవిధమేదారిం బ్రవర్తిల్లునో
భద్రింబేగతిఁ గల్గునో యని తలంపంజొచ్చె నెంతేనియున్. 73

గీ॥ ఘోరమృగముల క్రూరంపు టారవములు
నతులసంకుల ఝల్లీరవావళియును
నతిమనోహరవిపినదృశ్యప్రకరము
చలితుఁజేయవు వాని యోజనలవలన. 74

కం॥ ప్రావృణ్ణీరదవారము
లో వెలసెడి మెఱపుకరణి లోఁదమ మొదలం
గా వెలిఁగెడి యాలోచన
మా విజ్ఞునిఁ దేర్ప నాతఁడాపురిఁ జేరన్. 75

చం. పలువురు నేకతంత్రములో పన్నుచునుండి తదీశురాక నె
ట్టలో విని మెల్ల జారెడునటుల్ దిననాథునిరాక వేగుచేఁ
దులిసియొకొక్కచే యడు లదృశ్యముఁగా శశి వట్టుబడ్డదొం
గలగురునట్లు తెల్లనయి కానగనెయ్యెనుమంట వింతగన్. 76

ఆ.వె. కాలవశత నొకట జ్ఞానవాసన సోక
వ్యాప్తతమను లెల్లఁ బాయుకరణి
సుసుచిరంబుగాఁగ సూర్యోదయము దోఁపఁ
దమము లెల్లఁ గ్రమతఁ దలఁగఁ జొచ్చె. 77

గీ॥ ప్రజలు గర్హించు దుష్టవర్తనము మూల
కుక్కరొకొక్కయటంచు నాకుక్కుటములు
జీవనంబులు స్థిరములు కావుకావ
టంచుఁ గాకులు కూసె దిగంతములను. 78

చ॥ తమసము వోవ నీరజవితానము లుబ్బున లేవ శీతవా
తము లిల వీవ హైమకణతండము తత్తిలలాడిపోవ దు
ర్దమఘనజారచోరనికరమ్ములు మూలలదూరు లేవ నా
ద్యుమణి నభస్థలిన్ బొడిచె నుత్తమలోకము సంస్తుతింపగన్. 79

గీ॥ ఘనతమోవృతమైన యజ్ఞానిహృదయ
మున మహాశాకిరణ మట్లు బొల్చిపొడమె
ఘనతమోవృతమైన జగమ్మునను స
హస్రకరముల ప్రభువు శక్రాశయందు. 80

గీ॥ గుములుగాఁగూడి విహరించు నమితమైన
తూబరములాది భీరుజంతుతతు లెల్ల
హరికిశోరరవాస మాయమగునట్లు
లుడుహిమాంశులు సనిరి సూర్యుండు పొడమ. 81

శా॥ ప్రోద్యన్మేఘసమావృతుండయిన సూర్యుం డాత్మ తేజోరమా
జోద్యంబొప్పఁ దదంబుదప్రతతినిన్ సూక్ష్మంబుగాఁ దోలి ని
ర్భేద్యజ్యోతిఁ జెలంగునట్లు నృపుఁడున్ వేధించు కష్టావళిన్
దద్యత్నంబునఁ ద్రోలి దీప్తిఁగన నాత్మన్ మంత్రియూహించెడిన్ 82

మ॥ ధరణీజాహృదయాబ్జమిత్ర ! జలదోద్యద్గాత్ర ! నీరేజనే
త్ర ! రసోదంచితసచ్చరిత్ర ! విబుధత్రాణైక దీక్షాపవి
త్ర ! రణోద్ఘాటితశత్రుగాత్ర ! బుధసంతాపాటవీవీతిహో
త్ర! రఘూద్వంశపవిత్ర! ధీరనుతిపాత్రా! మిత్రగోత్రోద్భవా.83

భూతిలకము: శిష్టజనావళిపోషణా! నృపశేఖరాన్వయభూషణా !
దుష్టనిశాచరభంజనా ! పరితుష్టమానసరంజనా !
దృష్టివినిర్జితదానవా ! నిజధీసముద్ధితమానవా !
స్పష్టలసద్గుణభాస్వరా! మహిజాహృదంబుజభాస్వరా!84

తోదకము: కామ్యఫలప్రదగౌరవనామా !
సౌమ్యజనస్తుతసద్గుణధామా !
రమ్యశరీరనిరాకృతకామా !
భూమ్యధిపస్తుతభూపలలామా !

ఇది శ్రీరామానుకంపాకటాక్షలబ్ధకవితాధౌరేయ కౌండిన్య
గోత్రపవిత్ర ముత్యవంశ పయఃపారావార రాకా
సుధానిలయ కామేశ్వరాంబా సూర్యనారాయ
ణార్య తనయ విబుధవిధేయ
శ్రీ సుబ్బారాయ ప్రణీతం
బైన నిశ్శ్రేయసానంద
కావ్యమందలి
తృతీయాశ్వాసము
సమాప్తము.

శ్రీ

# నిశ్శ్రేయసానందము.

## —: చతుర్థాశ్వాసము :—

కం. శ్రీజయబలదచరిత్రా!
నైజదయాపూర్ణనేత్ర! నారదగాత్రా!
భూజానికులపవిత్రా!
భూజాహృదయాబ్జమిత్ర! బుధనుతిపాత్రా! 1

శా. శ్రీయందున్ విభవంబునందు గడువాసిన్ గన్నవాఁడైన నె
న్నోయిక్కట్టులపాలుజేసి మతిశాంత్యుత్సాహముల్ పాయఁగా
జేయున్ గర్మమదెట్టిచిత్రమొకదా జేజేలనుంగూడ! వి
జ్ఞేయజ్ఞాతయు నొందకుండునె విరక్తిప్రాభవోపేతుఁడై! 2

ఉ. కాననమందు రాణివిడి గణ్యచరిత్రుఁడు బుద్ధిసాగరుం
డానయవర్త్మ కట్టిగతి నాపగలేమికి నెంతయేనిఁ దా
నాననమెత్తలేని త్రప నందుచునుండుటఁజూచి నాయకుల్
వానిసమర్థరీతిగనె భాషణజేయుచుఁ దేర్చిరెంతయున్. 3

చ. క్రమమున నాసుశీల నటుకాననమందున వీడువార్త రా
జ్యమునఁ బ్రకాశితంబగుట 'నట్టిసులక్షణపోవ నింక సౌ
ఖ్యముఁ గననేర్తుమే' యనుచు నాడెడువారును 'నట్టియద్వితీ
యమహిళ నింకఁగాంచ'మని యాడెడువారును నైరితత్పురిన్. 4

ఉ. అందలికొందఱన్నిటను నానరపాలునకర్హమైనదౌ
సుందరకన్యకామణిఁ జూచి వివాహము సల్పితీరఁగా
డెందములందుఁ దీవ్రమగు శేవలఁబూనుచు నెన్నియేని యె
న్నందగు కన్యకామణుల నవ్యపటంబులఁ దెచ్చిచేర్చినన్. 5

క. ఎన్నన్ని చిత్రపటముల
నన్నరనాయకులు దెచ్చి యధిపున కిడుచు
నన్నరపతి యందొందును
నెన్నక యన్నిటినిమున్న యెంతయుఁ ద్రోసెన్. 6

చ. అనృతము నెట్టివేళలను నాఁడియెఱుంగని ఱేఁడు నచ్చకుం
డిన నొకకన్న నచ్చినటు నెమ్మివచింపఁగలేఁడు తజ్జన
మ్మునకు ముదమ్ముఁగూర్ప, నిజముంగన నాతనియాత్మ కెక్కఁజా
లిన పటమాజనమ్ము నిడలే, రిటు వంతను బొందిరెంతయున్. 7

ఉ. రమ్యతయున్న నుండదట ప్రాభవ, మొక్కట నద్దియుండినన్
సౌమ్యతశూన్య మద్దియు నెసంగినచోటఁ గులంబు నందువై
షమ్యము దోఁచు నందుఁగడు జక్కఁగనున్న మఱొక్కలోటునై
భూమ్యధిపాగ్రగణ్యు మది పూర్తిగ నొందును నచ్చకుంటచేన్. 8

మ. కడ కానాయకు లెన్నియేజతనముల్ గాఢమ్ముగా సల్పి యె
క్కుఁడు తన్మంత్రియు సాయమున్ సలుపఁ జేకోఁగల్గి రాసింధురా
జదుతత్పుత్రికచిత్ర మిట్టగని యయ్యేణాక్షియే నచ్చి తీ
రెడు నాభూపునకంచు నెంచి కడుహర్షింపంగనై రెల్లరున్. 9

మ. సకలంబౌ శుభలక్షణంబులను భాస్వద్వర్తనంబందు రూ
పకళాశోభలఁ బూర్వరాజ్ఞివలెఁ దత్పద్మాక్షి భాసిల్లి యిం
చుక 'ప్రాయంబున లేతయై చురుకునన్ సుస్ఫారలావణ్యమం
దకలంకమ్ముగ మంట నాపెను నృపుం డాసించు' నంచెంచుచున్. 10

ఉ. వారు దదీయచిత్రమును పార్థివచంద్రునకిచ్చి యామెను
స్ఫారగుణాదులన్ మిగులసంస్తుతిచేసి వచించి యట్టి స
ద్ధీరసులక్షణాఢ్య తమదేశముఁ జేరిన సర్వశోభల
వ్వారినఁ గల్గితీరునని వారు పదింబది పల్కుచుండఁగన్. 11

ఉ॥ కన్యకలక్షణావళులఁ గాంచఁగ నట్టివయంచు రాజనన్
ధన్యతనందురీతిగనె తజ్జను లెంచి నృపాలుచిత్ర మా
కన్యకకందఁ జేయఁగ నఖండగుణాన్వితయైనయట్టి యా
మాన్యయుఁ దచ్చరిత్రము సమస్తమెఱింగికొనంగఁ జూచుచున్

శా॥ కర్ణాకర్ణికగా నరాధిపుఁడు మున్ గాఢంబుగా నెంతొసం
పూర్ణప్రేమ వివాహమాడిన పువుంబోడిన్ మహాసత్త్వసం
కీర్ణంబౌ వనమందు వీడెనని పంకేజాక్షి యాలించుటన్
దూర్ణప్రక్రియ నామెనొక్కపరి దానున్ జూడఁగాఁ గోరినన్. 13

చ॥ తడవులనుండి దేశములఁ దద్దయుఁ గ్రుమ్మరి చెందుచున్న య
య్యిడుమలు నాఁటితో నుడుగ నెంచుచు నుండెడువారి కామె య
వ్వడువునఁ బల్కు నానుడు లపారముగా వ్యథఁ గూర్చె నింతకున్
బడిన వ్యథాళి వ్యర్థమగుమాదిరి తోఁచుటచేత వారికిన్. 14

కం॥ పిడుగులు నడివడిఁ బడియెడు
వడువున నుడివిన నుడువుల భయపడిరి కడున్
బడతుక నుడివిన వడువున
నుడివిన నప్పడఁతి కేమి నుడువునొ యంచున్. 15

కం॥ అవ్వార లవ్విధిని బడు
నెవ్వగఁ దిలకించి మంత్రి నేర్పు మెయి ధృతిన్
నివ్వటిలఁ జేసె వారల
కవ్వనిత గుణాళిఁ దెలిపి యతివిపులముగన్. 16

మ॥ సచివాగ్రేసరుఁ డాధరాధిపుని పజ్జన్ నిల్పి సర్వస్వమున్
వచియింపన్ బటమందు లేమఁ గనులన్ గంటాదిగా నన్యకా
ర్యచయంబేమియుఁ దోచకొక్కపరిఁ బద్మాక్షిన్ గనన్ గోర్కెఁ దోఁ
చుచు వాత్సల్యమొ ప్రేమయో కలఁచునంచు న్బల్కి తేఁడంతటన్

కం॥ ఒక పరివనమునువిడి యూ
రికిరమ్మని రాణి పేరఁ బ్రేమంబున లే
ఖిక నొండు వ్రాయ నదిగొని
యకలంకుఁడు మంత్రి వోయె నావనమునకున్. 18

మ॥ "కడుధర్మంబున బద్ధుఁడై క్షమఁగొనంగా వెట్టిగా దాష్ట్య మే
చెడి వేళన్ గడుఁగ్రూరుఁగాఁగఁ, దఱినీక్షింపన్ దరిన్నిల్పు నా
తఁడు నిష్పారుఁడుగాఁగ హేయమతిఁ గుత్సాకర్ముఁడై ముఖ్యమా
నెడివేళన్ విరసుండుగాఁ దల చుటల్ నీచంబు ధీరాత్మునిన్." 19

శా॥ ఎంతే నీగతినున్న తస్థితిని మంత్రీశుండు డెందంబునన్
జింతంజేయుచు భక్తిరక్తిగదురన్ నిశ్శ్రేయసానందులం
దెంతేఁ బొల్చెడిసద్గుణంబులనుఁ దానేగెన్వనిన్ జేర స
ర్వాంతర్యామినిఁ దాఁతలంచుచని సాయంబాటకున్ మ్రొక్కుచున్

శా. ఉత్సాహంబున సద్ద్విజావళులతో నుత్కంఠమైఁ బాడుచున్
వాత్సల్యంబున నేణులంగలిసి సద్భావంబుమైనాడుచున్
జిత్సంవిత్సుఖరూపలీలలను మానింజేరి భాషించుచున్
సత్సాంగత్యముమై గుణీకృతమహానందమ్ముతోఁ గ్రాలుచున్.21

చం. తన చిరునవ్వు వెన్నెలల దద్వనమెల్లఁ గడున్ బ్రకాశితం
బొనరుచు చున్ మృదుప్రవిమలోక్తుల నవ్వనచారిణీసఖీ
మనముల నుల్లసంబిడుచు మంజులభాషలచేత సేవచే
మునిహృదయప్రమోదదగఁ బొల్చుచురూపముఁగొన్నమోదమై

శా॥ ఉత్కంఠన్ మునిరాజునొద్ద నిగమాంతోక్తుల్ విమర్శించు నే
తత్కాంతాజనసంస్తుతాంచితచరిత్రన్ లేమ నిశ్శ్రేయసన్
దత్కాంతారమునందుఁ జూచి వినయోద్యద్భక్తిమైమ్రొక్కి తా
ముత్కంఠన్సచివుండు లేఖకనుఁ జేనుంపంగ నారాణియున్.23

ఆ.వె. "కర్మమునఁ బొసఁగు నగణ్యచిత్రంబులఁ
దెలియఁగలుగువారు గలరె యెందు ?
సంభవముల వడి నసంభవములు సేయుఁ
దలఁపనట్టిపనులు గలుగఁజేయు

చ. ఒకనియనుగ్రహంబునకు నొక్కనియాగ్రహదృష్టికిన్ మఱొ
క్కొకనిమహోన్నతస్థితికి నొక్కని నీచపుమన్కికిన్ జనుల్
ప్రకటితకర్మమొండె నుడువందగు కారణమంచు నెంచనే
రక యితరంబు నెంతురపురా, కతమంచు విమోహులై కడున్.25

శా. పంకేజాసనవాసవప్రముఖదేవస్తోమముల్గూడ ని
శ్శంకప్రక్రియ నిచ్చఁద్రిప్పఁగల ప్రజ్ఞంగల్గు నాకర్మమీ
వంకన్ రాజ్యముఁ జేరనన్ను నియమింపన్ బోవ కింకేటి కా
టంకం? బెల్లరునన్నుఁబంపరె సుహృత్పస్వాంతులై' యంచుఁదాన్

చ. తలఁపఁగ నామగదిన్ నిలుచు తద్విభుహాసయుతాస్యచంద్రమం
డలమునుఁగాంచుచున్ నిలుచు డంబున నాతని భూరిసద్గుణా
వళియు విశాలభావములుఁ బాయకనాదుమనంబునందు ని
చ్చలు వెలయున్ గదా ! నృపుని సంతతదర్శనమెట్టిభాగ్యమో ?27

శా. ఆధీశాత్ముని యాజ్ఞచేత విధిచే నత్యంతమున్ బద్ధనై
యాధారంబు నృపుండుగా వనిని నేనావాసమున్ జేయ నెం
తేధన్యత్వమునొందెనొక్కొ ! పురమత్త్యేష్టంబునన్ నన్ను
మన్నాథుం డచ్చటికేగుదెమ్మనుచు నానంబుచ్చినం బ్రేముడిన్ ?"

కం. అని యిటు పరిపరివిధములఁ
దననాథుని సద్గుణప్రతతిన్ మతి యో
చనసేయుచు నిశ్శ్రేయస
తనదు ప్రయాణప్రయత్న తత్పరతఁ గదున్. 29

చ. ముదుసలియొద్ద నామెహితము న్గనగోరెడు ప్రాణతుల్యలౌ
ముదితలయొద్దసున్ సెలవుఁబొందుచుఁ బెంపుడులేళ్లఁ బ్రీతిమై
గదిసి నఖాలదువ్వి సుమకాండములొక్కటముద్దుపెట్టి తాఁ
గదలె నమాత్యుఁ డాయితముగా నొనరించిన తేరునెక్కుచున్. 30

శా. ఈనిశ్శ్రేయస కానవీడి పురికై యేతెంచు టాలించుచున్
దానేమెంచెనొ కాని, సింధుపతి, యుద్యత్సత్సభన్ జేసి, యా
యానందప్రభునిన్ జనావళినినయ్యబ్జాక్షిని నిశ్శ్రేయసన్
దానాహ్వానముఁజేసె గౌరవమహాసందంబు లేపొందగన్ 31

మ. సచివాగ్రేసరు ప్రోద్బలంబుపయి నాసర్వంసహాపాలకుం
డుచితంబౌ పరిహారమున్ సతియు సత్యోత్కంఠమై నాయకా
ళి చమూరాజియు వెంబడింపఁగ మహాలీలన్ సభన్జేరఁ గో
రి చనెన్ భావిగతిన్ రవంతయున్ నేరీతిన్ విమర్శింపకే. 32

శా. ఈరీతిన్ దమదేశమున్ వదలి సుం తేదూర మవ్వారలే
తేరన్ యుద్ధపువాద్యముల్ పిదపఁ దద్విఖ్యాతసైన్యంబుపై
నారాచమ్ములు రాగ ‘సింధుపతి తన్మర్యాదకై యెంచి తా
నారీతిన్ బొనరించియుండు’నని యూహంజేసి రవ్వారలున్. 33

చం. క్రమమున ముందువెన్కల నగణ్యబలమ్ములు మూగి బాణవ
ర్షముగురియంగ నెల్లరుఁ గరమ్ము మహాద్భుతమంది మంత్రిధీ
రమతిబయల్పడన్ ద్రుటినిఁగ్రాలఁగఁజేసిన మోహరానను
త్తమగతి నిల్చి సల్పిరతిదారుణరీతి మహాహవమ్మటన్. 34

ఉ. శౌరియు సీరి భార్గవులు చాలగ నోడు ప్రతాపమొప్ప భూ
దారుని నాటిసంగరవిధానమెసంగె మహాద్భుతంబుగా
నారవిజీవభార్గవుల కందగరాని విచిత్రలీలఁ బెం
పారెను ధీరధీపటిమ నాసచివాగ్రణి గ్రాలినాఁడటన్. 35

చం. అధిపుపవిత్రాపశక్తియును నాసచివాగ్రణిమంత్రియుక్తియున్
మధురవచః ప్రభావయుగు మానినియుత్సుకవర్ధకోక్తియు
త్యధికమదైన తత్ప్రజలప్రాంచితమౌ ప్రభుభక్తియున్ మహా
నిధులయి యుగ్రరీతిగ సనిన్ బొనరింపగఁజేసె వారినిన్. 36

శా. ఆ సైన్యంబలకోసలాధిపుని సైన్యమ్మాటయున్ రాజులే
కా సైన్యంబును మంత్రియేనడుపగా నైయుంట వీక్షించుచున్
వీసంబైనను యుద్ధకారణములన్ వీక్షింపలేకున్న తే
డా సైన్యంబులఁ దూలనేసె ఘనశౌర్యాటోపమేపొందగన్ 37

ఉ. ఆహవమందు నెల్లెడల నానరనాయక మౌళియై చమూ
నాహినిఁ నెల్ల వారలకుఁ బాయని యండగనై మహాబలో
త్సాహములుప్పతిల్ల రిపుసైన్యము రిచ్చనడంగఁ జేసెఁ ద
త్సాహసవృత్తులంగనుచు సాధ్వసమందె దిదృక్షు సంతతుల్. 38

చం. మెఱియలవంటి సైనికు లమేయబలాన్వితు లవ్విదేహభూ
వరపరిరక్షితుల్ కుధరభాస్వర ధైర్యులు జూపు ఘోరసం
గరకుశలత్వముంగని యఖండముగా వెఱగంది దిక్కులన్
బరి తెగిపోవుచున్న నిజవర్గముఁ ద్రిప్పుచు వారిమంత్రియున్. 39

మ. అతికోపారుణితాక్షుఁడౌచు నతిశౌర్యక్రోధముల్ మీఱ శ
త్రుతతిన్ నుగ్గునొనర్చికొంచు ఘనవిద్యుద్వేగ మొప్పన్ మహో
ద్ధతిఁ జేరంజని బుద్ధిసాగరుని యుద్ధస్యందనంబున్ వడిన్
శతబాణమ్ముల నొవ్వనేసి పలికెన్ సక్రోధుఁడై యీగతిన్. 40

శా. "దోర్దండాంచిత చాపశింజినిగడున్ దూర్ణంబుగా లాగి మ
ద్దుర్దాంతాద్భుతవిక్రమంబు మెయి నీదుర్గర్వసర్వస్వ మా
యుర్దాయంబు సమాప్తిఁ జేసి భవదీయోర్వీశు బంధింతు వే
మర్ధింతున్ భవదీయసైన్యముల సామర్థ్యంబు దీపింపగన్. 41

శా. యతివేషంబున లోనఁజొచ్చి యెపుడో యైనట్టి సందర్భమున్
జతురత్వంబునఁ బైకిలాగి యెటో మత్సర్వంసహానాథునిన్
మతిపోవంబొనరించి త్వద్వచన సంబద్ధుండుగాఁ జేసి తీ
వతిదార్ఢ్యంబున, ఁగాచికొమ్ము భవదీయాధీశునిప్పట్టునన్ ! 42

శా॥ "సామర్థ్యంబున నేను రాజ్యమును నిచ్చల్ బ్రోవకేయున్న చో
నేమైయుండునొ నీతలంపుమెయి ! నేఁడింతేల నేనెంచిన
ట్లీమార్గంబున మీరువచ్చిపడుటే యెంతేని తార్కాణమా
నామానాథుఁడుమాధవున్ మనుపసుస్వాంతుండుగానుంటకుఁ."

మ॥ అనియేమేమొ వచించుచుండ నని హాహాకారముల్ రేగ ని
మ్మనసానందనృపుండు కోసలచమూపున్ క్రూరనారాచపం
క్తిని ఘూర్ణిల్లఁగ నేసియుండుటను, నార్తిఁ దచ్చమూసంతతుల్
కనగా దిక్కులులేక పారి రట లెక్కన్ మీఱి యొక్కుమ్మడిన్. 44

శా॥ ధైర్యప్రక్రియ శౌర్యధుర్యులగు యోధగ్రామణుల్ వచ్చి సౌ
కర్యంబేర్పడ మంత్రినాసచివుముఖ్యస్నేహితాళిన్ రణా
చార్యుండౌ నలబుద్ధిసాగరుని యాజ్ఞారీతిబంధించి యా
దార్యంబొప్ప విదేహరాజ్యమునకుద్యద్దీప్తిమైఁ జేర్పగన్. 45

చం॥ ఉచితగతిన్ విదేహకు మహోత్తమరక్షణమీయఁగా నమే
యచతురతన్ దదీయసచివాదులఁ గాచుచునుండ నర్హులన్
సచివుఁడధీశుఁడున్ నియమనంబొనరించి ప్రయాణమైరి, సై
న్యచయజయధ్వనుల్ నభమునంటఁగ, సింధుపతిన్ గనుంగొనన్

కం॥ అనుకొనని హఠాత్సంఘట
ననురాజామాత్యవరుల నైజబలమతుల్
గనితత్ప్రజాలెల్లరు గొను
ఘనమోదముఁ దెల్పఁదరమె కంజభవునకున్! 47

కం॥ వీరరుదెంచుచునుండుట
వీరుండగు సింధురాజు విని ముదమలరన్
వీరికిఁ గౌరవమీయఁగ
స్ఫారవివేకులను బనిచె వారి కెదురుగన్. 48

కం. ఆరాజవరాళియును న
వ్వారలఁ దగురీతి గౌరవముఁ జేయుచు న
వ్వారల కుచితస్థలుః ల
వ్వారిగ నేర్పాట్లుసేసె ప్రాభవమెసఁగన్. 49

మ. తనదౌ నెచ్చలిపిండుతో గదలి యేతత్సింధురాట్పత్ని యి
మ్మున నిశ్శ్రేయస నాపెనెచ్చలుల సంపూర్ణప్రభా గౌరవా
ళిని సమ్మానముఁజేసి యంతిపురి నోలిన్ జేర్చె తానంతయున్
జనవొప్పన్ గడునిష్ఠగోష్ఠిఁ గడపెం గాలంబు మోదంబునన్. 50

శా. శ్రద్ధాభక్తుల సర్వదేశవిబుధవ్రాతమ్ములన్ జేర్చి స
ద్బుద్ధిన్ ధార్మికశాస్త్రచర్చలను సంపూర్ణంబుగాఁ జేయ సం
సిద్ధుండౌ పరిణద్ధబుద్ధియగు రాజన్ దానికధ్యక్షుఁడై
సిద్ధింపన్ బొనరించె భూరిసభ నాసింధుక్షితీశుండటన్. 51

శా. ఆయానందనృపాలుపండితికి యుక్తాయుక్తసంవీక్షణా
మేయప్రజ్ఞకు వాదశక్తికిని సంప్రీతాత్ములై పండితుల్
ధీయున్ వైభవమున్ బలంబొకట సందీపించెనెసం చెంతయేఁ
జేయంజొచ్చిరి వానిసద్గుణతతిన్ జిత్రంబుగా స్తోత్రముల్. 52

పంచ. అశేష శేముషీ యశోసుఖాభభోగ భాగ్యముల్
విశేషసంపదాయురిద్ధ విత్త వైభవాదులున్
నిశాపవాళి యిచ్చి ప్రోవ నెమ్మి వేడిరాబుధుల్
దిశల్ కడున్ వెలుంగ నవ్విదేహరాజశేఖరున్. 53

చం. ధనమధికారమున్ గలిగి ధార్మికవిద్యలయందు నీగతిన్
ఘనమగు శ్రద్ధయాదరముఁ గౌతుకమాస్థయు భక్తిగౌరవా
ళిని గొని యుంట నెల్లరు భళీ! యితఁడే తగురాజటంచు బి
ట్టనుకొని రెల్లచోటులను నాఘనసింధునృపాలచంద్రునిన్. 54

ఉ. ఆసభ మైన వెన్క వినయాన విదేహనృపాలుఁ జేరి తా
నాసమయాన నంతిపురినాయితముం బొనరించుచున్న యే
దో సభలోని కొక్కవరి నోపిక రమ్మని సింధురాజనన్
దాసచివుండు వెంటఁజనఁ దత్సభఁ జేరె నతండు వేడుకన్. 55

గీ॥ ప్రభుని మంత్రిని నాయకవ్రాతములను
నంతిపురికాంత లెఱుగని యట్టిరీతి
వారివచనంబు లెల్ల నవ్వారిఁ దెలియ
వారుకోరునటులె జేర్చె వారిమంత్రి 56

మ. అచటన్ వీలగుచోటఁ జాటున నమాత్యశ్రేష్ఠునిన్ దత్ప్రజా
నిచయంబున్ విభుఁ గూరుచుండునటు నిర్ణీతంబు నామంత్రి చే
యుచు నిశ్శ్రేయసఁ జేర నవ్వధువు నత్యుత్కంఠఁ బిల్పింప నా
వచనంబున్విని భూషితాంగియయి యాపద్మాక్షి యేతెంచుచున్.

మ. ఋతుపాళిన్ గుసుమాకరంబువలెఁ దివ్యాభ్రాళి నక్షత్రమ
ట్లు తురంగంబుల శక్రువారువమటుల్ మోదాఢ్యగాఁ బూతగా
నుతిపాత్రామలగా నెసంగియచటన్ గూర్చున్న కాంతాళి దృ
ష్టితతిన్ వెల్గెడు భూరిరూపగుణరాశిన్ రాణి నిశ్శ్రేయసన్. 58

సీ॥ దోషరాజిని లీలఁ ద్రోసిరాజనులీల
నెఱినొప్పు నునుసోఁగ కురులతోఁడ
పంకజారిని నెంచి వంకలుంచి హసించు
సదమల మోహనాస్యంబు తోఁడ

పటుతమోహరమగుచు భవ్యమోదదము నౌ
చంద్రికం గేరు హాసంబు తోడ
నెట్టిదోషులనైన నిట్టిమార్పగనైన
నిద్ధకోమలశీత దృష్టితోడ

గీ॥ చూడఁజూడంగ నింకనుఁజూచుకోర్కి
దరికిఁజేరంగఁ సుగుణాళిఁదలఁచుకోర్కి
భాషవినగ నుచ్చైర్గతి వరలుకోర్కి
పొడమి మేలిమీఱఁగఁ జేయు మూర్తితోడ. 59

కం. శివకేశవవిధి రాజ్ఞులు
భువి నేకత నామరూపమును గొని రనస
ర్వవిమలగుణముల వెలయుచు
యువతీలోకంబునందు నొప్పెడు నాపెన్ 60

శా. ఆకర్ణాయతలోచనంబు నవసంఖ్యంబోలుకర్ణంబు శ్రో
భాకీర్ణంబయి నువ్వుపువ్వనగు రమ్యంబై నదౌ నాస యా
యాకాశంబును బోలు నెన్నడుము సొంపై నట్టి పాలిండ్లు వ
ల్లీకాండమ్ముల నేలు బాహువులు నోలిం గ్రాలు నిశ్శ్రేయసన్. 61

మ. కని యాకన్నియ భక్తిమీఱ నటునాకంజాస్యపాదాల చెం
తను సంప్రీతినమస్కృతుల్ సలిపి యేతద్ధ్యాననిర్మగ్నయా
చు నిమేషంబట దేహమున్మఱవ జుంచుం ద్రువ్వి యారాణియా
పెనుబై కెత్తి శిరంబుమూర్కొని మహాపేక్షన్ దరిం జేర్చుచున్. 62

గీ. జలజజంబీరజంబాల జాలములును
గగనగోస్తనీగాంగేయ గజములోడు
నానన కుచాంగరాగ దృగావళియును
నుదర వాగ్దేహగమనమ్ము లొప్పుదాని. 63

సీ. మందాకినీఫేన మందహాసముదాని
గిండ్లనుమీఱు పాలిండ్లదాని
స్వర్ణకాంతులమీఱు భవ్యదేహముదాని
వజ్రాలుమీఱు పల్వరుసదాని
కాలసర్పముఁబోలు ఘనవేణి కలదాని
కంబునుంగెల్చు కంఠంబుదాని
స్మరధనస్సునునోంపఁ జాలుకన్బొమదాని
మీలనుబోలు నేత్రాలదాని

గీ. కంజశోభనుమీఱు వక్త్రంబుదాని
బింబమునుబోలు ప్రవిమలోష్ఠంబుదాని
వరమిళిందపంక్తి గాను ముంగురులదాని
గేయమైయొప్పుసొబగునఁ గేరుదాని. 64

గీ. అతులకమనీయము విమలహార్షదంబు
సతతమందస్మితవికాస సురుచిరంబు
మంజులత్వజితాబ్జ బింబంబునైన
యతిసువికసిత కోమలాస్యంబుదాని. 65

కం. రూపమునానందంబును
నేపగుసుగుణాళిఁ జేర్చియిటులీకన్యా
రూపము నవ్విధిఁ జేయుట
దోఁపించుచునున్న మూర్తిఁదోఁచెడిదానిన్. 66

ఉ. అన్నిటఁ దన్నుబోలు రుచిరాంగకముల్ మృదుహాసచంద్రికల్
దిన్ననిభాషలున్గలుగు లేమను, యౌవనరాశిఁగాంచి యే
తెన్నున నాపినన్నిలక తేఁకువఁబొంగెడు ప్రేమమీఱ నా
మెన్నిముసంబుకౌఁగిలిని మేలుగఁజేరిచి రాణిపిమ్మటన్. 67

మ. మృదువాక్యంబుల నిట్లువల్కె నటఁదానే మేమిభాషించునో
తుదకవ్వారిప్రయత్నమే ఫలమునందుం బొందునో యంచుఁదా
మెదభావించుచు నూపిరిన్విడువ కెంతే నాయకుల్వేచెడఁ ద
త్సదతీరత్నము మేఱమీఱు ఘనసంతోషాన నాలింపగన్. 68

మ. సకలంబౌశుభమంగళంబులను నిష్టంబట్లు చేకూరుచున్
ప్రకటప్రాభవశోభలంగనుచు సంవర్ధిల్ల నాశీర్వదిం
చి కడున్ బ్రేమను ముద్దువెట్టుచట నాసీమంతినిన్ దన్ను నా
డకునాహ్వానముసేయు కారణము వింటన్ గోరనాకన్యయున్ 69

ఉ. "మీమహనీయవర్తనము మీమృదుభాషలు మీలసద్గుణ
స్తోమముఁ గూర్చి వించు మిముఁజూచి నమస్కృతిఁ జేసినంత శో
భామయమాను జన్మమను వాంఛను మిమ్మిటఁ బిల్వనంపితిన్
మీమహితానుకంపను క్షమింపఁగఁగోరెద నాశిశుక్రియన్. 70

ఉ. నాకములోనివారలకునైన నలభ్యములైన సద్గుణా
నీకముతోఁడఁగ్రాలెడు ననింద్యచరిత్రలు మీకులాని కై
వ్యాకులమంది శంకఁగొనువారల చిత్తము లుక్కడుండగాఁ
జీకటినిండియుండు గుహసీమలటంచుఁ దలంతు నెంతయున్. 71

ఉ. అప్పరమేష్టినైనను మహాద్భుతమందఁగఁజేయునట్టిదై
యొప్పెడి మీప్రవర్తనము యుత్తమరీతినిఁ ద్వత్కులోన్నతిన్
జెప్పక చెప్పుచుండఁగ, నిసీ! యనుమానమదెట్లుగల్గెనో
యప్పురివారు మెచ్చునటు లన్యులకెవ్వరునుందు రే భువిన్ ! 72

చం. అతులితశాంతిదాంతుల సముంచితలీలల. నాగమాంతబో
ధితసుపథంబునన్ మెలఁగి దివ్యయశంబునఁగ్రాలుచున్న యు
న్నతులను మిమ్మొ యీగతి నొనర్చిన నన్యులు నిల్చువెట్టు ల
బ్బ! తలుపుచెక్కలే తినెడువారల కప్పడమొక్క లెక్కయే! 73

మ. తలలోనాల్కగ నెల్లడన్ మెలఁగి యుద్యత్కీర్తి నార్జించు వే
ళల, మీ బిడ్డలఁ జేతులార విడుకాలంబందు, సంపత్సుఖం
బులవీడ్కొంచు వనంబుఁ జేరుతఱి నిష్ఠన్ మిమ్ము రమ్మంచు నిం
దులకున్ బిల్చిన వేళ మాఱని భవన్మోదంబె చిత్రంబగున్. 74

మ. వనితాదర్శకురాలుగాఁగ మిగులన్ భాసిల్లు మీ చెంత దా
సినిగా వర్తిల నెంతయేని మదివాంఛితున్ సదా కాని మ
ర్త్యనిరీక్షిన్గనలేని మూర్ఖజనులందున్ రాణిగామాత్రము ముం
టను వాంఛింపను సుమ్ము సుంతయున, నానందపరిపూర్ణాత్మకా!75

ఉ. చూచినయంతమాత్రమున శుద్ధవిరోధినినైన నెట్టిసం
కోచము లేని స్వచ్ఛమగుకూరిమిఁ గ్రాలగఁ జేయఁజాలు మీ
దౌ చిఱునవ్వు తజ్జనులయందున నేటికి రిత్తవోయెనో
తోఁచదు నాకు, నాదుమతిదోషము చేతన యేమొ! మాతరో! 76

మ. అనగన్ జిత్రము తేనిచిత్రము మదీయాక్షిన్ గనుంగొన్నదా
ది నితాంతామితభక్తి నామహితునిన్ దేవుండుగాఁ బూజసే
యనె తోఁచున్ మది నన్యభావనిసుమంతైనన్ గనంబోవ నీ
జనమెంతెంతగ యత్నముల్ సలిపినన్, సర్వేశు డేమెంచెనో!77

ఉ. దృష్టులమిమ్ముఁజూడకయు నిద్ధతరంబును సజ్జనాళిసం
తుష్టికరమ్మునై వెలయు తోరపువర్తనమీది వింట నే
కష్టమునొందియైన మిముఁగాంచి నమస్కృతిఁ జేసి జన్మమున్
శిష్టముఁ జేయు నిష్టమతి శ్రేష్ఠతఁ గల్గు నవార్యమైకడున్." 78

మ. అని భాషించు వధూవతంసమును బ్రేమారూఢిమై బుజ్జగిం
చి, నయంబొప్పఁగ నాయమేయసుగుణశ్రీయైన నిశ్శ్రేయసా
వనితారత్నము మాఱువల్కఁదొడఁగెన్ వాక్యంబు వాక్యంబునం
దును నేమాడునొ ఈమెయంచుజనులందున్ గాంక్షనాలింపఁగన్.

చం. “ఘాలిక వాట చేతను బ్రపంచపుఁదీరు నెఱుంగ నేరకే
లీలవచింతు, వేఘనుఁడు లీలమెయిన్ దమ తెల్వినున్నతిం
గ్రాలుట తెల్విలేమినివగంగొనుచుంటయు నుండునే? నరుం
డేలవ్యథాళిఁగుండెడు నొకించుకమార్చెడి శక్తియున్న చోన్. 80

ఉ. మజ్జనప్రకారమును మానసమందు నెఱుంగలేని యే
తజ్జనమట్లు శంకను వితాకును బొందుట వింతయంచు నే
సజ్జనుఁడున్ వచించునొకొ! సత్కులసంభవుఁడే నృపుండుగా
నిజ్జగమందు గోరఁడొకొ యెవ్వఁడుగాని; తలంచిచూడుమా! 81

చం. జనమెటుకోరుచున్న నటుసల్పినమాత్రము చేతఁ గాని నా
మనము నెఱుంగఁగోరుచు సమస్తముఁదెల్పినపై ననుజ్ఞని
చ్చిన విషయానఁగాని నృపుఁజిన్నగనెంచకు! మాప్రజాప్రియం
బునుఁ బరిపాలనావృతులమున్ వెలయించుఁ దదీయకార్యముల్.

మ. పరసైన్యప్రవిదారణంబునను, శుంభన్నీతిసంరక్షణా
భిరతిఁ దీవ్రత జేనికర్హమయినన్ విశ్వాసులౌ స్వప్రజల్
సరసంబొప్పసమంజసంబయినవౌ శంకల్ కడున్ జూపు చో
విరసుండట్టులు వీర్యమొప్ప నణపన్ విఖ్యాతియే, యెంచుమా! 83

కం. సత్యమును దూరదృష్టిని
నత్యంతము నరయు దేనియాత్మన్ దోఁచున్.
గత్యంతరమిక లేకా
శ్రుత్యంతపథానువర్తి సుపథమె సరిగన్. 84

ఉ. అన్నిటనామహామహుఁడు స్వాంతముమెచ్చిన కన్నె నెన్నుచుం
గొన్నదిగాని తజ్జనులకోరిక బిడ్డల నన్నువీడి యీ
తెన్నునఁ దత్ప్రజాతతులు తీఱుగఁ గోరిన సత్కులోద్భవన్
మిన్నకకొంటగాని కడుమేలును బిట్టు సమంజసంబగున్. 85

ఉ. సద్గుణపాళికిక్కయయి సంస్తుతసర్వసులక్షణాఢ్యుఁడై
సద్గతిదాయకుండునయి శౌర్యపరాక్రమరమ్యతాదిభా
స్వద్గుణమండితుండుగ యశంబును బొందిన మేటిఁ జేరు తే
త్వద్గణనీయపుణ్యమణి తప్పక నమ్ముము! శంక లేటికిన్! 86

శా. త్వత్సంపత్సుఖశోభలంగనుచు మత్స్వాంబునం దెంతయే
నుత్సాహంబును బొందుచుండుదునుగా కోయమ్మ! యీర్ష్యాదులన్
ద్వత్సౌఖ్యాదులకంతరాయమును నేభావింప, నెంతేనియున్
మత్సేవాదులఁ దృప్తిఁజేసెదనుఁ జుమ్మా, మిమ్ము మమ్మాటికిన్ !

చం. అతివగజన్మమందిన మహోత్తరపుణ్యము మీఱ నామహో
న్నతుని గృహంబుఁ జేకుచు ననారతసౌఖ్యములందుమమ్మ' భూ
పతిమదికెక్క నీవుభయవంశపవిత్రగ వర్ణనీయ స
త్సతిగఁ గృపాపరిపూర్ణగ విశాలమనఃపరికీర్తనీయగన్ !" 88

మ. ఇటులేమేమొవచించుచున్న తఱి నయ్యెక్కంబ్రవేశించుచున్
భటుఁడొక్కండు "నృపాలచిహ్నములతో భాసిల్లు నవ్యాగతుం
డట ద్వారమ్మున వేచియుండె" నన తేఁడాశ్చర్యముంబొంది య
చ్చటికిన్వారినిఁ దేఱ సంజ్ఞలననుజ్ఞం జేయ నాఁడేగినన్. 89

మ. పులిపై పుత్రగనింక నేదొ ముని గెంబోయంచు నచ్చోటివా
రలు సాశ్చర్యభయాదులై కనఁగఁ దదాక్షిముఖాబ్జాననా
వళి విఘ్నమ్మనుబొంది యోగి యొచటన్ బ్రక్కన్ జనంబున్న జా
డలకున్ వింతనుబొంది రంతిపురియాటన్ సంశయస్వాంతులై, 90

మణిమాల: శ్రీమద్రఘువంశక్షీరాంబుధిసోమా!
సోమాంకముఖోద్యత్ సూరిస్తుతనామా।
భూమీతనయాసంపూజితగుణధామా!
జీమూతసమానస్ఫీతాంగలలామా!

మాలిని:- సరసిజనిభహస్తా సర్వలోకప్రశస్తా
స్ఫురదురుతరకీర్తీ సుందరోదారమూర్తీ
ఖరకరశశినేత్రా గాఢజీమూతగాత్రా
స్మరహరనుతచారా మైథిలీచిత్తచోరా! 92

తోటకము- వినయాదిలసద్గుణబృందవరా !
దిననాథకులాంబుధిదీప్తికరా
మునిశేఖరహృత్స్ఫుటమోదకరా
ఘనగాత్రరమాజితకంబుధరా ! 93

ఇది శ్రీరామానుకంపాకటాక్షలబ్ధకవితాధారేయ కౌండిన్య
గోత్ర పవిత్ర ముత్యవంశ పయఃపారావార రాకా
సుధానిలయ కామేశ్వరాంబా సూర్యనారాయ
ణార్య తనయ విబుధవిధేయ
శ్రీ సుబ్బారాయ ప్రణీతం
బైన నిశ్శ్రేయసానంద
కావ్యమందలి
చతుర్థాశ్వాసము
సమాప్తము

శ్రీ

# నిశ్శ్రేయసానందము.

## —: పంచమాశ్వాసము :—

శ్రీ జనకసుతాహృదయస
రోజాతజలరుహమిత్ర రూక్షకటాక్షో
త్తేజోజికరిపురాజీ!
రాజీవవిశాలనేత్ర ప్రకటచరిత్రా. 1

కం. వచ్చెడిసంగతులను గన
నచ్చెరువుగ నచటివారలందఱు మిగులం
బొచ్చెంబులేని యాత్రం
బచ్చుపడంగ, నెదురుచూచు నాసమయమునన్. 2

ఉ. అంతట నేగుదెంచె నట కంగభవప్రతిమానరూపుఁడొ
క్కింతవయస్సుచెల్లిన యహీనబలాఢ్యుఁడు రాజశేఖరుం
డెంతయుఁబిల్చె వేడు తన చేరువనాసనమందుఁ జేర్చి య
త్యంతము గౌరవానఁ గుశలాదులఁ బృచ్ఛను సేయ నాతఁడున్. 3

కం. హర్షంబెసఁగఁగ గోసల
వర్షాధిపుఁగాంగఁ దన్నుఁ బలికికొని సమా
కర్షించెనచటి వారిని
శీర్షముఁదనవైపు వారు చేరిచి వినఁగన్. 4

శా. "ఈరీతిందమరీరహస్యసభయం దేపారుటాలించియున్
నే రాకుండఁనిలంగ లేనికతమున్వివ్విన్వింతు, భూనాయకా!
ఘోర వ్యాధులమిచ్చుమచ్చరితమీకుం దెల్ప మీకున్న యీ
స్ఫారానందము భంగమొందుననుచున్ శంకింతు నాత్మన్గడున్"

కం. అనిగాంభీర్యము దైన్యము
ననుతాపముగదురఁబల్కి యానరపతిదృ
ష్టిని నిష్టహృష్టసూచనఁ
గని తనకథనిట్లుబలుకఁగాఁజనె వడిగన్. 6

చం. "అతులితసౌమ్యలక్షణసమన్వితయై విలసిల్లునట్టిస
త్సుతఁగని నాదుతొంటిసతి తూర్ణముగా దివికేగెఁ దానుత
త్సుతనొకతూరియుం దిరిగిచూడకె, తత్సుతఁజూచిపండిత
ప్రతతి మహోన్నతస్థితిని భాసిలునంచువచించె నెంతయున్. 7

ఉ. తత్తరుణీవివాహమునఁ దద్దయుఁగ్రుంగియొక బ్రమేగఁగా
బిత్తరినొర్తుబెండ్లిఁగొని పిమ్మట నాల్గుసమల్ సుఖంబుగా
నత్తఱిఁబుచ్చితిన్, బిదపనైనది యేమని తెల్పువాఁడ ! నా
చిత్తము తల్లడిల్లు నది చెప్పఁగఁబూనినయంత నెంతయున్. 8

ఉ. ఏనొక యేడునాళ్ళైసుమి యేగితిఁగానకు వేఁటఁగోరి! యా
లోననె నాదుపుత్రిపరలోకముఁజేరుటవింటి నామెమో
మ్మైననుఁజూడనోచికొననైతిని, నాఁడటఁపండితావళుల్
దానినిగూర్చి పల్కినవిధంబెటుబోయెనో! వింతయయ్యెడిన్. 9

కం. జననిని బోలినసుతుఁడును
జనకునిబోలిన సుగాత్రిచయ్యన నెంతే
ఘనుఁలౌటవిందు నామెయు
ననుసరిగాఁబోలియుంట నమ్మితిబుధులన్. 10

ఉ. ఇర్వదియైదువత్సరములెట్లొ గతించె ననంతరంబు; నే
నుర్వివసించియుంటిని తదుత్తమపుత్రికవీడియిట్లు; నా
గర్వము సర్వముక్షమడిసెఁ, గాంతయునాలుగు వత్సరాలకున్
బూర్వములోకమున్విడిచిపోయె గృహస్థలిశూన్యమౌగతిన్. 11

కం. తద్రీతివెతలమునిఁ గెడి
మద్రాజ్యమునందు నపుడు మసలఁదొడఁగె భా
స్వద్రచన వచనములఁ జం
చద్రీతి జనాళినేలు జటియొకఁ డెలమిన్. 12

ఉ. పువ్విలుకానిలీలసరిపోలెడిరూపము దేవపూజ్యునిన్
నవ్వ మతిప్రభావమును నల్వగునావరయోగిమాళి నా
యవ్వరపుత్రిచాపమియు హాయిగనొక్కటనుంటయున్ గడున్
మవ్వపుఁ బ్రేమఁ దెల్పి కడుమమ్ముల నమ్మఁగఁ జేసెలీలగన్. 13

ఉ. మంత్రుల తెల్వి నావలఁ గ్రమంబుగఁ గాంచఁగనయ్యె నంతయేఁ
దంత్రమునన్ ద్వితీయసతి తత్సుతఁగానను బార వేయు నా
మంత్రము, నాఁటఁ గోలెయిఁడుమల్ పడి తేల్చుకొసంగనయ్యె మా
మంత్రులు నేను నాదుసుకుమారి చరించిన కాననంబులన్. 14

ఉ. త్యాజ్యమెనన్నుఁ బోలిన యధఃపతి తాఁగ్రణికంచు మంత్రికిన్
రాజ్యమునొప్పగించి సుతరంజిలుచోటనుఁ గూర్చి యొందఱే
పూజ్యులఁ జేరి యారయుచు బోఁటినిగాంచుటొ మేనుజంతుసం
భోజ్యముఁగా వనిన్ విడుటొ పోలునటంచు వనాలఁ గ్రుమ్మఱన్.

మ. చిరకాలంబు తపోగ్నిఁ గ్రాలునల కాశ్మీరప్రభుండాయమన్
గరుణం జేరిచి పెంచి విద్యలిడి తాఁ గల్యాణమున్ జేయుటన్
సరవిన్ వించుఁ దదీయమాని చరణాబ్జాతంబులన్ జేరి మీ
చరితంబెల్ల దదీయమానికడ నిచ్చన్వింటి, రాజోత్తమా! 16

మ. మద్గృహమందెయుండినఁ గుమారిక కింతటి సద్యశంబు భా
స్వద్గతియున్ సువిద్యలును బ్రాపును బాల్పడియుండునొక్కొ! త
త్సద్గురు నిత్యసేవఫలితంబుగ నయ్యవి కల్గెఁగాని! యే
తద్గురుదర్శనానఁ గద దక్కెను నాకసువుల్ కుమారియున్! 17

మ. రానని యెంతపల్కినను బ్రార్థనఁజేయుచు నామహాత్ముని
న్నేనిటతోడి తెచ్చియిటనిల్పితి మీపురమందిరంబునన్
గానఁగనిండుమ త్సుతను గన్నులపండువుగాఁగ నొక్కమా
ఓనరనాథ!" యంచుఁగడునూర్పుచుఁబల్కుచు ఱేనిఁగాంచుచున్

ఉ. "సత్కృపమై మదీయసుతచావమిఁ దెల్పి యెటెట్లొ మేమటన్
దత్కథలన్ బయల్పరుపఁ దద్దయుఫీలును తెల్పినట్టియే
తత్కమనీయయోగి, భళి! త్వత్సచివాగ్రణిఁ బోలియుండెడిన్
దత్కళలన్నిటన్ గన నతండనియే కడుతోచుమన్మతిన్." 19

కం. తచ్చిత్రకథను విని జను
లచ్చోనాశ్చర్యశోకహర్షాఢ్యులుఁగా
నచ్చటికి రాణిఁ దెమ్మని
యచ్చటనానందభూపుఁ డానతినిచ్చెన్. 20

గీ. దైవికమ్ముగ నటఁ దటస్థమ్ములయిన
చిత్రసంఘటనలకు నచ్చెరువునంది
కరము నానందబుద్ధిసాగరులు దైవ
శక్తి యద్వితీయమగుటఁ జాలఁ దలఁచి 21

కం. ఎన్నెన్నిమార్లు రమ్మని
యన్నను దనతోడ రాని యాముని పురికిన్
దిన్నగ విచ్చేయుట విని
యన్నరపతి యలరుచు సచివాదులతోఁడన్. 22

మ. చని యారాజమునీంద్రమాళికి నమస్కారంబు గావించి య
ర్చనలన్ బేర్మినొనర్చి యంతిపురికర్హంబైన మర్యాదఁ దో
డ్కొని తెచ్చెన్ గని ప్రీతి నెల్లరును నర్కుంగాంచు కంజాళిరీ
తిని యుత్ఫుల్లమనస్కులై నతి ముదుద్రేకంబునం జేయఁగన్.

కం. ఆయుత్సవసమయంబున
నాయూరిజనంబులెల్ల నంతిపురి మహా
మేయానందమునన్ జొఱ
నే యెడఁ గ్రిక్కిరిసియుండె నెంతయు నదియున్ 24

శా. ఆనిశ్శ్రేయస మూర్తి గొన్న వినయం బాయన్నరూపంతోఁ
దా నేతెంచుచుఁ గోసలాధిపునకున్ దద్యోగికిన్ మ్రొక్క నా
భూనాధుండు కవుంగిలించి శిరమున్మూర్కొంచు దేహంబు నే
తా నెంతే మఱచెన్ క్షణంబు ఘనమోదంబందిరం దెల్లరున్. 25

కం. జనకుఁడు సుతయును రూపం
బున నొక డేరీతినుంటఁ బోల్చుచు వారల్
వినినట్టికథనుఁ దలఁచుచు
మునుపటి దమచెయ్వులకటఁ బొగులుచు మదులన్. 26

కం. నిష్కారణముగ నేత
న్నిష్కల్మషపుత్రిలను వనిన్ విడ నెంతే
ముష్కరగతి ననియుంటకు
శుష్కంబుగ నష్ట వగవఁజొచ్చిరి వారల్. 27

కం. నిర్భరవిపులానందా
విర్భావముగాఁగ వారు వెనుకను దత్సం
దర్భంబెరుఁగక యాడిన
దుర్భాషల కాత్మ నడలఁదొడఁగిరి మిగులన్. 23

మ. తమరాజ్ఞీమణి సద్గుణంబుల మహోద్యద్రూపమందున్ జరి
త్రమునందున్ యశమందెకాక విలసద్వంశంబునన్ మిన్నయా
ట మహానందమునొంది యెల్లరును నిష్టంబొప్పగా నామెపా
దములన్ వ్రాలి క్షమాపణంబడిగి రాత్రింబొప్ప దోషాళికిన్. 29

కం. ఆనందనృపుని సచివుం
డానందముఁ బట్టలేక యందఱిలోనన్
దానిటులపలుకఁదొడఁగెను
ధీనిధియని యెల్లవారుఁ దృష్టివహింపన్ 30

ఉ. "ఆవిధి కోసలన్ వివిధయత్నము లామె జనిపరికారమె
ట్లేవెలిసేయ శ్రద్ధవహియించుచు నిట్టిటఁబై నిద్రాలు నా
యావివిధవ్యథాహతుల కష్టపుమార్గము లెంచి మంచు నే
నీవిధినిందునందు వ్యథనేమియుఁదోఁచక మిగ్గితిన్ గదున్. 31

ఉ. మానవసాధ్యయత్నముల మానక యన్నియుసల్పియున్ విచి
త్రానఁ బయింబయింబడు వ్యథాహతులన్నిటినాపలేక దై
వాననె భారముంచి సలుపందొరకొంటి సమర్థమైన కా
ర్యావ విధానలోపము రవంతయు గల్గనీక యిచ్చటన్. 32

ఉ. తావినిబట్టి పూవులవిధంబును. దావునెఱుంగఁజాలు న
ట్లేవిమలంబుగా నెసఁగునీమెమహోత్తమవర్తనంబు స
ద్భావము నీమెసత్కులమువారితలీలలఁ దెల్పుచున్న నే
నేవిధిఁ దెల్పినన్ విడువరీయనుమానము నీపరిజాతతుల్. 33

ఉ. వారలకోర్కె రీతిగనె వారికిఁ బిడ్డలనప్పగింప భూ
దారుఁడు వల్లెయంటయును దత్సుతుల న్వధియింపఁగోరు న
వ్వారల మందలించి వెలి వారల పీడుదు నంచు గొంచు న
వ్వారల నీనృపాలునకుఁ బంపితి నుంపఁగఁ బెంపఁగా విటన్. 34

ఉ. బిడ్డలులేని హేతువున బిట్టును గుందుచునుంటచేత నీ
బిడ్డలఁగన్నబిడ్డలటు ప్రేమనుఁబెంచుచు సర్వవిద్యలన్
దొడ్డతనంబునన్ శిశులఁ దోరముగా యశమందఁజేసె నా
బిడ్డలు నీనృపాలునెడఁ బేర్మిపొసంగ నెసంగి రెంతయున్ 35

కం. రూపమునఁ గలదు తనసతి
కాపెకు నొకయింతపోల్కియని నృపుడనఁగా
నాపెనతఁడు కోరెననుచు
నీపెను జతనంబుఁ జేసి రీనరముఖ్యుల్. 36

శా. తద్యత్నంబున వారలున్నతటి సత్యంబున్ బ్రజారాజికిన్
వేద్యంబుంబొనరించు కోరికను గావింపంగ నేనీసభన్
జోద్యంబొప్ప సమస్తసంగతులు నిచ్చో వెల్లడిం బొందుచున్
మద్యత్నాళికిఁ బూర్ణసత్ఫలము సంపాదించె నీరీతిగన్. 37

కం. ఆలోన నేను మిగులన్
నాలోనను వెతలఁ బడి యొనర్చిన కృషి ని
వ్వేళను మీకెఱిఁగించుట
పోలుననియె తోఁచు నాకుఁ బూర్ణముఁగాఁగన్. 38

చం. క్రమమునఁ గోసలన్ మఱువఁగాఁబడి యుండినయట్టి రాణి జ
న్మముకథనెల్ల నెల్లర ఘనవ్యథమై వెలిసేసి తత్సమ
స్తముఁ బ్రభువర్యదృష్టులకు సాఁగఁగఁ జేసితి నందుఁగల్గుస
త్యము బయలౌనటంచునొకయాశను నెమ్మదిఁబూని యెంతయున్

ఉ. అందలిసత్యమాత్మఁగనినంతనె ఱేఁడు విచారమంది కా
నం దిరుగందొడంగె లలనామణికై యని వించుఁ గుందు చుం
డెందమునందు తేనిఁగను తేవ నెఱుంగఁగఁగోరి చారులన్
గొందఱఁబంపి యుండితి నకుంఠచరిత్రునిఁ దోడి తేరఁగన్. 40

ఉ. ఎచ్చట నాన్నృపాలు విధమే కనలేమినికెట్టిరీతిగా
పొచ్చెములేక యీచరిత పూర్ణతనొందునటంచు నెంచుచున్
రిచ్చనుజెంది నేను నలుకేళ్ళవలఁజూచుచునుంటిగాని యీ
మచ్చున దైవమీకథను మంజులరీతిని మార్చెఁ, జూడుడీ! 41

కం. ఏనీతేనిం బూని యె
ఱేనిన్ బంధించి యుందు నేమొ యనుచు న
మ్మానిత సచివుఁడు పొంచుచుఁ
బైనింబడె మొన్నమమ్ముఁ బట్టుకొనంగన్. 42

ఉ. సుస్తుతమైన యీసతి వచోవిధియున్ సుగుణప్రకాండమున్
శస్తసతీత్వధర్మమును సాయముగా నిట నేనొనర్చునీ
ప్రస్తుతయత్నమంతయుఁ బరాత్పరుఁడే ఫలియింపజేయునన్
నిస్తులధైర్యమే యిటులు నిల్వఁగజేసె ననున్ సభాస్థలిన్. 43

చం. ఎవఁడతిధర్మవర్తనుఁడు సిద్ధచరిత్రుఁడునై యెసంగు నా
ప్రవిమలుఁడైన వానికిల బాసటయై నిలుచుండుఁ గోరి భూ
తవితతి కాలమున్, శిలలు దక్కిన జంతుగణంబుఁ దొల్లి రా
ఘవునకు వానరుల్ శిలలుఁ గంధియు బాసటయైన కైవడిన్. 44

మ. ఒకటన్ ధర్మపథానువర్తనునికే యుర్వీన్వ్యథల్ గల్గుచుం
టకు మూలంబు శివుండుఁ దత్సముఁడు నెన్నన్నేర్తురే కాని యే
రికి శక్యంబగుఁ దెల్ప? నావ్యథలు నేక్రేవన్ దదుత్తీర్ణునిన్
వికలంబుంబొనరింప వాఁడెపుడున్ విజ్ఞానియై యుంటచేన్. ''45

కం. తద్రీతింబలుకుచు మో
దోద్రేకము చేత నిలిచె నొక పరి యతఁడే
తద్రాజవరుల జనముల
ముద్రితచిత్రంబువోలెఁ బొడగనుచునటన్. 46

శా. అత్యానందమునొందు నా సమయమం దానందుఁడాకోసలా
మాత్యాళిన్ బిలిపింప వారలు నిజక్ష్మానాథునిన్ దత్కథా
సత్యంబున్ గని వింతనంది రమలస్వాంతుండు తద్యోగితా
నత్యంతంబు సమర్థవర్తనల మర్త్యానీకముల్ మెచ్చఁగన్. 47

శా. త్యాజ్యంబేయిఁకనంచుఁ గోసలవిభుం డవ్వేళ నవ్వారిలో
రాజ్యంబెల్లఁ దదీయపుత్రికకుఁ దోరంబొప్పగా నిచ్చి తాఁ
బూజ్యుండౌ నలయోగిపుంగవునితోఁ బోఁబోవు నవ్వేళ యం
దీజ్యామండలియే దివంబయిన యట్లే వారుసానందులై. 48

ఉ. కోల్పడిపోతిమంచు ననుకొన్న శిశుల్ ప్రతిబాధ్యు లద్వయా
నల్పకళాఢ్యులై తమరి నల్వుగ జేరుటచేత సిద్ధసం
కల్పుఁడు యోగిచంద్రుఁడు ప్రగాఢదయన్ దయచేయుటన్ మదిన్
దెల్పఁగరాని మోదమునఁ దేరిరి రాణియు రాజు నెల్లరున్. 49

చం. అకలుషు డానృపుండు తనయాపటముంగని యామెఁగాంచఁ బ్రే
మకలనఁ గోరె భక్తిని కుమారియుఁ దన్నృపుఁ జూడఁగోరె నీ
ప్రకృతిరహస్యమారయఁ గరబ్బునునేరమి నెంచిరేదొ నా
యకు లితరమ్మటంచు జన మచ్చట నెంచఁగఁజొచ్చి రంతయున్. 50

మ. నరుకన్నన్ బ్రబలంపుశక్తి నడుపున్ నల్వొప్పగా నెల్లెడన్
నరునిన్, సత్యము నీనిజంబు స్థిరమైనం గూడ నన్యున్ దనున్
సరవిన్ నేతలుగాఁ దలంచు నరుఁ డీసత్యంబు స్వాంతాన వి
స్మరణంబున్ బొనరిచుకొంటగద సంబద్ధుండగున్ హీనుఁడై 51

మ. దురహంకారములేక తృప్తమయి నెందుంగూల కాత్మచ్యుతిన్
బొరయంబోవ కమేయవర్తనసతంబున్ నిల్చి యన్యుల్ నిరం
తరమున్ దన్గని వారివర్తనల దిద్దంగల్గురీతిన్ ధరన్
జరియింపంగలవాఁడె జ్ఞానియని యెంచంజొచ్చి రందెల్లరున్. 52

శా. ఆనాఁడట్లు క్రమక్రమంబుగా నలభ్యంబౌచు మోదప్రదం
బౌ నాసంఘటనాదు లచ్చట నసంఖ్యాకంబుగాఁ గల్గుటన్
గానంజేరిరి గాని యందఱట లెక్కన్ మీఱి యానాఁడు గా
కేనాఁడైన జనంబు లంతిపురిలో నీరీతిగాఁ జేరిరే! 53

ఉ. ఆసమయంబునం దచటి యార్యజనంబటు యోగిచంద్రునిన్
గోసలరాజచంద్రుఁ గడుఁగూరిమిఁగన్గొని మోదపూర్ణతన్
బాసిలె వాహినీంద్రుఁడు శుభప్రదు చంద్రునిఁ గాంచినంత నా
శ్వాసముఁజెంది సంతసము వర్ధిల పొంగి జెలంగు భంగిగన్. 54

ఉ. కూర్మి విదేహరాజ్యమునుఁ గోసలసింధుల నేలుకొమ్మటం
చర్మిలి బిడ్డఁదత్పతు లుదంచితలీల వచించినంత ల
యార్యార్మికదంబసంకులమహో త్తోదధిపూర్ణిమ నట్లు మోదపుం
బేర్మిని బొంగి ఘోషిలె నమేయగతిం జనమెల్ల నచ్చటన్. 55

మ. "పరధర్మంబున దూర కెందు తనదై భాసిల్లు ధర్మంబునన్
స్థిరతన్ నిల్చుచుఁ దాను కాని తనువృత్తి చిత్తంబులం దానుగా
నరయంబోక సమర్థ కార్యరచనంబం దన్యదుస్సాధశ
క్తిరహింపంగనువాఁడె ధీరుఁడని రక్తిన్ నేర్చి భాసిల్లుడీ!" 56

కం. అని యారాజర్షి వరుఁడు
ఘనతకరుణాంతరంగకమనీయుండై
జనముల కాశీర్వచనము
లనుపమలీలల నొసంగ నలరిరి వారల్. 57

చం. ఘనతఁ బ్రసాదనామమునఁ గ్రాలెడు నయ్యువరాజు నిర్మలా
ఖ్యాను విలసిల్లు కన్నియను నంతట వారి పురమ్ము జేరఁగాఁ
గొనుసమయంబునన్ జనులకుఁగల మోదము వైభవోత్సవా
ళిని వివరింపఁగాఁదరమె లేఖకుఁడెవ్వని కేని నుంతయున్! 58

మ. తీరనికష్టమంచుఁ బలుతెన్నుల బాధలనొందు తమ్మునా
తీరునఁ దేల్చువారల యదృష్టముగూర్చి వచించువారు గం
భీరమతిప్రభావముల పేర్మి కథన్ గడుఁజిత్రలీలలన్
మాటిచినట్టి మంత్రి మతిమాన్యత మెచ్చెడువారు నైరటన్. 59

మ. నరనాథాగ్రణులందు నెంతయును నానందుండు, నిశ్శ్రేయసా
తరుణీరత్నము స్త్రీలయందును నమాత్యశ్రేష్ఠులన్ బుద్ధిసా
గరుఁ డాదర్శగతిన్ బ్రసాదుఁడట యుక్తప్రాయుఁడౌ నంతకున్
బరిపాలించిరి వేదశీర్షవచనప్రాశస్త్య మింపొందగన్. 60

మ. అతిసేవ్యంబు యతిస్తుతంబునగు నాత్మానందముం బొందు ధీ
చతురుం డొక్కఁడె యీప్రపంచమునఁ గష్టంబుల్ కలంగింపకుం
డి తరింపంగల మేటియౌచు ఘనతుష్టిన్ బొందఁగాఁ గల్గుఁ
కితరుల్ నిల్వఁగ నేర్తురే యచలులై యీసౌఖ్యధుఃఖాదులన్? 61

శా. ఇష్టంబైనను గష్టమైన మఱియెం తేనష్టమేయైన నే
క్లిష్టంబైన పరిస్థితింబడిన శంకింపండు విజ్ఞాని యా
శ్లిష్టస్వీయసుధర్మవర్తనముమై జెన్నారగా నిల్పడిన్
శిష్టుండై పరమేష్ఠి యిష్టమిడు తచ్ఛ్రేష్ఠావళీహృష్టుఁడై. 62

మ. తమధర్మంబునువీడి యన్యమగు నాధర్మంబునన్ లాభలో
భమునన్ జొచ్చి పరస్పరేర్ష్యలను సర్వధ్వంసమున్ జేసి లో
కమహానందము భంగపుచ్చకయ వజ్ఞల్ న్యూనతాధిక్యభే
దములన్ వీడి పరస్పర ప్రియత మర్త్యశ్రేణిక్రాలన్ వలెన్. 63

చ. చివరకు వాని దేజయముఁ జిన్మయసౌఖ్యముఁ బంచభూతస
త్ప్రవిమలసేవయున్ యశముఁ బ్రాభవరీతి స్వధర్మమార్గమే
తవిలి చరించు నెవ్వఁడు వ్యథన్ సుఖరాజిఁ గలంగకుండ న
న్యవివిధ ధర్మరాజిని రవంతయు జారక లాభవాంఛలన్. 64

శా. ఆదర్శంబితఁడే యటంచు సకలాశాంతస్థవిజ్ఞావళుల్
నాదంబుల్ వొనరింప భూరిగుణసంపన్నుండు ప్రజ్ఞాయితుం
డౌదార్యాన్వితుఁడున్ సువిక్రముఁడునై యత్యంతమున్ దత్ప్రజన్
వేదోక్తంబగురీతిఁ బాలనముఁ జెల్విన్ జేసె నాత్మోన్నతిన్. 65

ఉ. సార్థకనాముఁడై సకలసద్గుణధాముఁడునై యమేయుఁడై
వర్ధిలు బుద్ధిసాగరుని ప్రజ్ఞయు సాయముకాఁ బ్రసాదుఁ డే
స్పర్థలులేని శాంతిమెయిఁ బాలనఁజేయఁగఁగల్గె సౌఖ్యసం
వర్ధకలీల రాజ్యమును ప్రాభవమేర్పడ రక్తి చొప్పడన్. 66

ఉ. శ్రీయుతమై యమేయము, నజేయమునై, ఘనరమ్యహర్మ్యశో
భాయుతమై, సమస్త విభవస్ఫుటమై విబుధాళిసేవ్యమై
న్యాయమహాపథానుసరణస్ఫురణాఢ్యజనప్రకీర్ణమై
హాయినిఁగూర్చె వారిపుర మన్నిపురంబుల మేలుబంతిగన్. 67

సీ. రాగంబు శూన్యంబు రాగమేయున్నచో
ఘనభవబంధమోక్షంబునందె
క్రోధంబు శూన్యంబు, క్రోధమే యున్నచో
బహుజన్మకారణ స్వాంతమందె
లోభంబు శూన్యంబు లోభమే యున్నచో
నార్జితశాంత శమాదులందె
మోహంబు శూన్యంబు మోహమేయున్నచో
బ్రత్యగాత్మైక్య పథమునందే

గీ. మదము శూన్యంబు మదమున్న మమత నణప
మత్సరము శూన్య మదియున్న మలములందె
భువిని దివిఁ జేయు కీలకముఁ గను ఘనులు
నాపురమునందుఁ బొల్చు బ్రాహ్మణులు మణులు. 68

ఉ. వేదములం బఠించుటయొ వేదమహార్థములన్ వచించుటో
భేదమతుల్ హరించి సుఖవీచులఁ దేలఁగఁ జాలు సంతతా
హ్లాదపథాన నెల్లరు మెలంగఁగ నేర్చు విధిఁ విధించుటో
కాదని స్వప్రయోజనపుఁ గాంక్ష స్వధర్మమువీడ రాద్విజుల్. 69

కం. బాహుబలమునఁ జతుర్భుజు
నాహవమున గెలువఁ జాలు నపరిమిత బలో
త్సాహాన్వితులుఁబరార్థ
స్నేహితులుఁ బ్రపంచహితులు నిఖిలనృపసుతుల్. 70

కం. తమబలవిద్యాసర్వ
స్వము నెల్లప్పుడును ధర్మసంస్థాపనఁగా
క మదమ్మునఁ దుచ్ఛపు స్వా
ర్థమునకునై వాడరచటి రాజకుమారుల్. 71

చం. ఒకటను లేని వస్తువుల నొక్కటఁ దెచ్చుచు నొండుఁగూడ మూ
లకుఁ బడకుండ, సుంత మిగులంగఁ గ్రయించియు శ్రీలనర్థనా
యకుఁ బురుడింపజాలియును న్యాయ్యముదప్పరొకప్పుడైన న
త్యకలుషజీవులర్యజను లార్యమహాజనులన్నిభంగులన్. 72

కం. వినయము, భయమును, భక్తియు
ననుకూలతఁ, బ్రియము, క్షమయు నలర ద్విజుల కో
పినకోలఁది నమితసాహా
య్యానిరూఢి మెలంగుచుందు రచ్చటిశూద్రుల్. 73

మ. తమ రాజ్యంబున నేసమస్యయయినన్ దార్కొన్నఁదామన్యుల
ట్లమహాదూరగులౌచు 'ఏమయిన' దంటల్ మాని తామందునన్
దమకర్తవ్యముఁ బూర్తిఁజేసి తుదిటిలోఁదమ్మ్రక్తులై యెల్లరున్
విమతవ్యాళమ్ము గెందుర్లై యతులశాంతిన్ గాంతురెల్లప్పుడున్.

మ.. నడువంగష్టమటంచుఁగాని నడువంగష్టంబులౌ వానినిన్
విడువన్బావ్యమటంచుఁగాని విధులన్ వీడంగ నూహింప, కె
క్కుడుశ్రద్ధన్ తహివిప్రకారముల సంకోచంబు లేకుండ నె
య్యెడ నెవ్వారికి వారు వర్తిలుదు రెంతే మోదమేపొందగన్. 75

శా. తద్రాజ్యాంతరసీమలన్ వెలయు కాంతల్, సర్వవిద్యాదులన్
భద్రోపాయములన్ బలాదులను రూపంబందునున్ మించి ని
ర్ణిద్రప్రక్రియ భర్తలన్ శిశువులన్ స్నేహస్వభావానఁ జం
చద్రీతిన్ గడుసాయమాదురు మహోత్సాహోన్నతిన్ బేర్చుచున్.

చ. తమతమజాతికిందగు విధంబగు ధర్మము నెల్లవారు ని
త్యమును సమాచరించి, యిసుమంతపరస్పరభేదబుద్ధియున్
భ్రమయును న్యూనతాధికతరస్థితులు న్మద మీసు లేక శాం
తిమెయిని వర్తిలంగలరు తేకువమీఱఁ బ్రజాళి యచ్చటన్ 77

మ. నిజవర్ణాశ్రమయోగ్యధర్మతతులన్ నిత్యప్రమోదంబుఁ గూ
ర్ప జనుల్ వర్తిలువారె కాని పరధర్మంబందు సంప్రీతి ని
ల్చి జడత్వంబునయుక్తమా తమక్రియాళిన్ హీనులై యున్నతిన్
బ్రజలందున్ గనఁగోరువారి నటఁ జూపన్ నేర మేయొక్కరిన్.78

మ. పటుయంత్రమ్మున నెట్టిచోటుల నమర్పంబడ్డ భాగాదు ల
చ్చట నేయుండక మారుచున్నయెడ నీషన్మాత్రమున్ యంత్రమె
ప్పటి యట్లాడనిరీతి జాతులును సిల్పంబడ్డ ధర్మాళి నుం
డుటఁబోనాడి కలంగుచున్నయెడఁ గీడున్గల్గు వృత్తుల్నెడున్. 79

శా. ఆయంత్రమ్మున నేవిభాగమును నాయా స్థానరాజిన్ మహా
మేయంబౌ విలువన్ వహించునటు, నెమ్మిన్ సర్వజాతుల్ సదా
స్వీయస్థానములన్ సమానఘనతన్ జెందున్ బరస్థంబులై
పాయున్, గాన స్వధర్మమే సతము సల్పన్ జాతు రెందున్బ్రజల్.

మ. ఎపుడున్ బైపయిఁ దోఁచు భేదములు లేకే జాతు లేపారు నం
టపహాస్యప్రద, మైనఁదోఁచెడి విభేదానీకముల్ లేని స
ర్వపదార్థస్థితసచ్చిదాత్మ కలతత్వమ్మెంచి యానందపూ
ర్ణపథంబందుఁ బరస్పరప్రియముమై రంజింతు రయ్యెల్లరున్. 81

మ. సతముగా భేదములన్ గనంబడుటె నైజంబౌ జగంబందు భే
దతతుల్ బాపి సమంబుసేయుటకు యత్నంబుల్ వృథాయంచు సం
తతమా భేదములన్ మనుంగని యభేదజ్ఞానముగా నేర్చి ధీ
రత వర్ధిల్లెద రేపరస్పరమదేర్ష్యల్లేక ప్రేమాత్ములై. 82

మ. అవివేకంబుఁ బరస్పరేర్ష్యలును గ్రౌర్యంబున్ వివాదంబుఁ దృ
ష్ణ విడంగల్గి జనుల్ కులంబులును దన్న్యస్తంబులౌ వృత్తు లా
ర్యవినిర్దిష్టవిధానవర్తిలుచు నుద్యచ్ఛాంతినే పొందుచున్
భువిదారిద్ర్యపిశాచముక్తులయి సమ్మోదింతు రెంతేనియున్. 83

కం. న్యూనాధిక జాతులలో
న్యూనాధికమై భవముల నుండిన జనులం
దూనరు నీచోన్నతమతు
లానందమె కందు రెందు నాభేదతతిఁ. 84

చ. హృదయములన్ బరస్పరశుభేచ్ఛల భూరివిశాలభావముల్
సదమలతన్ వివేకమును జక్కఁగ నేర్వక యున్న నేకతన్
బొదలఁగఁ జేయ బైపయినిఁబూనెడి యత్నములెల్ల వ్యర్థమౌ
టఁ దలఁచుచున్ సమత్వముఁ బొడంగన నేర్తురు భేదరాజినిన్. 85

కం. స్థిరుఁడై సుఖకరుఁడై గుణ
వరుఁడై యతులచతురంగబలభాస్వరుడై
సురుచిరుఁడై రిపుహరుఁడై
నరవరుఁ డరమరలఁదొరగి నరులను బ్రోచెన్. 86

గీ. సకలసద్గుణములుగల్గి చతురుఁడగుచుఁ
బ్రజలబిడ్డలరీతిఁగాపాడుచుండి
వారివిశ్వాసముంబొంది ప్రభుఁడుఁబ్రజలు
నలరిరి శిరమ్ము నితరావయవము లట్లు. 87

సీ. ఘనసుదర్శనుఁడౌట జ్ఞానధాముఁడు నౌట
నగధరుం డతఁడుఁ బన్నగధరుండు
శ్రీశోభితుండౌట జితమన్మథుండౌట
మారతాత మఱికుమారతాత
సద్వనమాలియై సదహీనమాలియై
మాధవుం డాత డుమాధవుండు
భూరమాధవుఁడౌట భోగదీప్తతవీశ
వాహనుండు గవీశవాహనుండు

గీ. రూక్షవీక్షణమాత్ర సుసిక్షితోగ్ర
ఘనవిపక్షుఁడేయయ్యుఁదా ననవరతము
సకలముని దేవ సేవితసచ్చిదాత్మ
నాత్మవీడమి శ్రీధరుం డాతఁడగున. 88

కం. రూపంబు విద్యాజవ్వన
మేపును సద్గుణవితాన మెంతయు నాభూ
మీపతి కులదీపకునం
దే పస నొండొంటిమించి వృద్ధినిఁ బొందెన్ 89

మ. కడుసూక్ష్మంబుగ గ్రీష్మమందు జలమాకర్షించి యాలోకమి
త్రుఁడు సర్వంబును వానకాలములయందున్ సస్యవృద్ధ్యర్థమై
యిడున ట్లానరపాలుఁడున్ బ్రజలనేమేన్ బన్నులంగొంచు న
య్యిడుమల్ వాపవ్యయించి సంతతమురక్షించున్ సమస్తక్షితిన్

మ. ప్రజచేతన్ సతతంబు నారలను సంరక్షింపగా నిల్వఁబ
డ్డజనుండంచుఁ దనుస్తనున్ నృపుఁడొకంటన్ భూరిభోగాళి నీ
రజపత్రాక్షులతోడ నన్యవివిధప్రాకామ్యముల్ తీర్చుకో
నజుఁడా వైభవమిచ్చెనంచుఁ దలపోయంబోఁడు స్వప్నంబునన్.91

మ. అకలంకుండగు నానృపాలకుఁ డమాత్యాచార్యసామంతనా
యకమిత్త్రాప్తపురోహితాదిపరివారావేష్టితుండై సభన్
బ్రకటప్రౌఢిమనుండ బోయలును పౌరస్తోమముల్ వచ్చి కా
నుకలన్ దీర్చి సభక్తి మ్రొక్కి వినయానూనాత్ములై నిల్చుచున్.

మ. అమితోగ్రాహివరాహసింహశరభవ్యాఘ్రేభభల్లూకఖ
డ్గమహోక్షాదివనాటముల్ మిగులలెక్కన్మీఱి యొక్కుమ్మడిన్
స్వమహాక్రూరత గ్రామసీమలను స్వేచ్ఛన్ జొచ్చి తామెల్లచో
ట్ల మదంబొప్పఁ జెలంగుచుంట మొఱవెట్టన్ నాథుఁ డాలించుచున్

ఉ. ఇంతగ క్రూరసత్త్వములు వృద్ధినిఁ జెందెడిదాఁక నేల ర
వ్వంతయు శ్రద్ధఁ దీసికొనరైరని మంత్రులవైపుఁ జూచి గో
రంతకొంతలేక మృగమార్గము సర్వమునాయితంబుగా
వింతురుగాక శీఘ్రమని వేగమ యానతినిచ్చి యయ్యెడన్ 94

ఆ. అలఘుతమములైన యట్టికార్యావళి
మాత్రఁదీర్చి యపుడమందగతిని
వేటఁగోర్కి సభను నాటికిఁ జాలించె
రణవిజితరిపుండు ప్రభువరుండు. 95

మ. దరభేరీపణవానకాదులును నుద్యచ్ఛృంగగోవక్త్రముల్
మొరయన్ విండ్లనుఁ గందెలున్ వలలురుల్ పూరేండ్లుగొడ్డండ్రు దు
ర్భరశాణాసన శూలకుంతపరిఘవ్రాతాదిశాతాయుధో
త్కరమున్ బోటరివేఁటరుల్ గొని మహోత్సాంతన్విజృంభింపగన్

చ. ప్రభుతిలకుండు భూభరణభార మమాత్యులకప్పగించి జం
తుభయము మాన్చు నుత్సుకత తొందరఁ బెట్టఁ బ్రభాకరాభస
న్నిభఘనతేజమొప్ప గణనీయమహోగ్రచమూసమేతుఁడై
సభయముగన్ రిపూత్కరము సందులదూరఁ బ్రయాణమైతగన్

కం. అవనీసుర శుభసూక్తులు
సువాసినీ హారతులును సుజనవినుతులున్
కవిగాయక సన్నుతులును
నవిరళముగ వెలయ నధిపు డరిగెన్ వనికిన్. 98

కం. కతిపయగమనంబుల న
య్యతిలోకపరాక్రమాఢ్యుఁ డరిగి యరిగి యు
ద్ధతిఁ జేరెఁ బుణ్యగణ్యము
నతులమృగశరణ్యమును మహారణ్యమటన్. 99

ఉ. మాటులఁ బెట్టియున్ వలలమాయలఁ బన్నియు మచ్చులుంచియున్
వాటపుఁగాపుగాయుచును వన్యమృగప్రకరమ్ములన్ సము
ద్ఘాటిత చిత్రవాద్యములఁ దత్తలముల్ విడనాడఁజేసి యా
రాటమునన్ గలంగి చెదరంగ నొనర్చిరి వేటగుల్ వెసన్. 100

ఉ. కొన్నిటిబాణజాలముల, గొన్నిటిశూలపుఁలోటులన్ గదన్
గొన్నిటి ముష్టిఘాతములఁ గొన్నిటిఁ గ్రూరమృగావళిన్
మహాపన్నతఁనొందఁజేయుచు నృపాలుఁడు భూరివినోద మొప్ప
వేటన్నడిపించె నిస్తులభటప్రకరంబులతో వనంబులన్. 101

గీ॥ క్రూరమృగములఁ బెక్కింటిఁ గూలనేసి
కొంతఁ విశ్రాంతిఁగొనఁ జింత నుంతపొడమ
పాదచారియై వనిని నృపాలవరుఁడు
చనియె నొకస్రవంతీతటమ్మునకు లీల. 102

గీ. చెంతనున్నట్టి మునిపల్లెఁ జేరి యచట
దర్శనీయులౌ ఘనులఁ బెద్దలను గొలిచి
భవ్యవిషయాళి నెఱిఁగి దీవనలనొంది
యతులితాకర్షణీయ దృశ్యములఁ గాంచి. 103

కం. సైన్యమ్ములు బరివారము
లన్యులు సచివులును దన్ను నచ్చటజేరన్
మాన్యుడు ప్రసాదనరపతి
వన్యస్థలివీడి యరిగి స్వపురోన్ముఖుఁడై. 105

కం. రాకాశశి రాకకునీ
రాకర మేకరణికెరలు నాకరణిని భూ
మీకాంతురాక కలరి పు
రౌకసు లుప్పొంగి చెలఁగి రుత్సాహమునన్ 106

చం. మదమునఁ గ్రొత్తిజూపి కడుమన్ననఁగన్న నృపుండు కాక పెన్
ముదమునఁ బ్రేమజూపి మనముల్ గొని యుండిన నేతయాట స
ద్హృదయము మీర నెల్లరును దీవన లాఁగతులిచ్చి పొల్చిరొ
ప్పిదమగు నెమ్మనమ్ములను పెద్దలుఁ బిన్నలు సంతసంబునన్. 107

మ. అకలంకార్థికలౌక్యసాంఘికమహాధ్యాత్మోన్నతాముష్మికై
హికసన్నైతిక రాజకీయవిధులంతెంతేనియారోగ్యవ
ర్ధకమార్గంబులఁదేరఁగా బ్రతినరుం బ్రజ్ఞాన్వితుం జేయుటన్
సుకరంబయ్యెను వారిపాలనము విజ్ఞుండైన యాతేనికిన్. 108

మ. సచివశ్రేష్ఠుఁడు బుద్ధిసాగరుని ప్రజ్ఞాయుక్తిశక్తుల్ స్వకీ
యచమూరాజియు నాత్మబుద్ధియు ప్రసాదక్ష్మావనీపాలు శ
త్రుచయార్తిప్రదుఁగాగ స్వీయజనసంతోషప్రదుంగా నొన
ర్చి చతుర్వార్ధిపరీతకీర్తియుతుఁడై చెల్వొందఁ జేసెంగడున్. 109

ఉ. ఎట్టిమనమ్ము లోఁగొనుచు నిట్టె విశుద్ధునొనర్చి ప్రోచుచున్
జట్టముజేయలేని పని చక్కని బోధలొనర్చునంచు నా
దిట్ట సుబోధలన్ మిగుల దీప్తిని వ్యాప్తి నొనర్చి యెల్లెడన్
గట్టిగ నీతిమార్గమునఁ గట్టి దివంబునుఁజేసె భూస్థలిన్. 110

మ. ఎది నేర్వంగనియున్న నన్యమగు నెన్నే విద్యలున్ లోఁగు నె
య్యది నేర్వంగనకున్న నన్యమగువిద్యల్ పూర్ణతంగూర్పవో
యది నేర్వంగని యుంటఁ బెక్కురిహలోకాముష్మికాధ్యాత్మికే
ద్ధదురూహాత్మసుఖాళి నిచ్చమెయిఁబొందంగల్గి రొక్కుమ్మడిన్. 111

మ. బలమున్ రూపము వైభవంబుఁ జలముల్ బ్రాగల్భ్యముం గల్గియు
న్న లవంబుల్ విషయప్రసక్తి మదముల్ దంభంబునుం బొందమిన్
వెలయున్నింతల వింతయై పతి తొలిన్వెల్గొందు నయ్యేడు విం
తలకుం దొంటిగ నిల్చి యంచుఁ గడు నెన్నం జొచ్చి రం దెల్లరున్

శా. వేదాంతప్రతిపాదితాంచిత మహావిజ్ఞానమార్గంబునం
దేదాంతుండు మనోవచఃక్రియలయం దేపొప్పవర్తిల్లునో
మోదంబాతనిసొమ్మైయె సుగుణముల్ పూర్ణంబుఁగా నొంది యా
హ్లాదించున్ ఘనశాంతి, యన్యున కదెట్లబ్బున్ రవంతేనియున్!

మంజుభాషిణి:- సతతార్తరక్షణవిచారభాసురా!
శ్రుతిమస్తకప్రజవిశుభ్రమందిరా!
దితిజాళిభీతికరధీరసంగరా!
క్షితిజామనఃకమలచిత్రబంభరా! 114

కవికంఠభూషణము,-
మహనీయదివ్యమహిమాస్థిరతోషితసర్వలోకధీరా
అహితాళిభీకరమసమహారాంగణనైపుణీవిచారా
తుహినాంశువక్త్రపరితుష్టబహుక్రతుభుఙ్మనుష్యవారా
మహిజామనఃప్రియతమప్రతిభాయుతచారుసంప్రచారా!

మంగళంమహాశ్రీ.-
అర్కకులజాత మునియాగజయదాత నగజాధిపశరాసనవిరామా
తర్కతతిదూర పరతత్త్వసువిచార మహితక్షితిభవాహృదయధామా
కర్కశవినాశ రిపుకాండయమపాశ దశకంఠమదభంగకరనామా
మర్కటపతీశ ఘనమానిహృదయేశ నిగమస్తుతమహేశజయరామా

ఇది శ్రీరామానుకంపాకటాక్ష లబ్ధకవితాధారేయ కౌండిన్య గోత్ర
పవిత్రముత్యవంశ పయఃపారావార రాకా సుధానిలయకామేశ్వ
రాంబా సూర్యనారాయణార్య తనయ విబుధవిధేయ శ్రీ సుబ్బా
రాయప్రణీతంబైన నిశ్శ్రేయసానంద కావ్యమందలి పంచమా
శ్వాసము సర్వస్వము సంపూర్ణం.

# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 1 | దలఁపు | దలఁపుల్ |
| 4 | 16 | దౌరాజన్య | డౌ రాజన్య |
| 6 | 12 | తెరలోన్ | తెరలలోన్ |
| 7 | 1 | నల్లు | ఁబెల్లు నల్లు |
| 8 | 13 | నద్వాని | సద్వాని |
| 10 | 3 | లాఘూ్యాండ | లాఘ్యుండ |
| 13 | 16 | దీయ్యంబు | దీయంబు |
| 14 | 9 | ఖద్యోతనా | ఖద్యోతనా |
| 17 | 2 | సర్యమయుని | సర్వమయుని |
| 18 | 4 | సద్వ్యిహిత | సద్విహిత |
| 18 | 20 | నల్యాగు | నల్వాగు |
| 19 | 20 | వికృదు | వికృతు |
| 21 | 23 | ధ్వాలుల్ | ధ్వానుల్ |
| 22 | 4 | నిశ్శేష్టులు | నిశ్చేష్టులు |
| 25 | 15 | సమ్మాని | సన్మాని |
| 30 | 3 | పూర్వాదిముండె | పూర్వాముండె |
| 31 | 6 | దృషికి | దృష్టికి |
| 37 | 2 | సల్పి | సల్పి సల్పి |
| 37 | 13 | దెసఁగె | దెసఁగు |
| 38 | 13 | నాకొక్కక | నాకొక్క |
| 40 | 3 | దులిసి | దెలిసి |
| 40 | 3 | యదుల | యుదుల |
| 40 | 4 | మంట | మింట |
| 43 | 3 | నన్నర | న్నన్నర |
| 44 | 3 | గుణాన్విత | గుణాన్విత |
| 45 | 7 | నిప్పారుడు | నిస్సారుడు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 46 | 13 | నామగదిన్ | నామదిన్ |
| 47 | 7 | నినిశ్శ్రేయసన్ | నిశ్శ్రేయసన్ |
| 47 | 8 | ఆహ్లానము | నాహ్వానము |
| 68 | 11 | నడంగ | వడంగ |
| 50 | 9 | నెచ్చలి | నెచ్చెలి |
| 58 | 10 | నెచ్చలులు | నెచ్చెలుల |
| 50 | 22 | రిత్థ | రిద్ధ |
| 55 | 7 | ర్ణితి | రీతి |
| 56 | 4 | గుండెడు | గుండెడు |
| 57 | 5 | మయ్స్వాంబున | మత్స్వాంతబును |
| 57 | 14 | డొకండు | డొక్కండు |
| 59 | 3 | జిక | జిత |
| 60 | 7 | [illegible] | త్స్వాత |
| 63 | 5 | [illegible]పం | రూపంబు |
| 64 | 19 | బి[illegible] | బిడ్డల |
| 67 | 11 | గరబ్బును | గరమ్మును |
| 67 | 16 | బొనరిచు | బొనరించు |
| 67 | 17 | తృష్ట | తృష్ణ |
| 68 | 7 | మహోహాతోదధి | మహోహాదధి |
| 68 | 14 | ఘనత | ఘనతర |
| 68 | 22 | శారు | వారు |
| 69 | 7 | గల్గు | గల్గుగా |
| 70 | 8 | వుర | వుర |
| 71 | 23 | తహింవి | విహింత |
| 73 | 8 | నిర్దష్ట | నిర్దిష్ట |
| 75 | 6 | యెక్కుమ్మడి | యొక్కుమ్మడి |
| 76 | 13 | లోటులగా | బోటులన్ |
| 78 | 14 | మసమహారాంగణ | మహాసమరాంగణ |